# పరిచయం

దక్షిణ భాషాపుస్తక సంస్థవారు ప్రోత్స హించిన ఉత్తమగ్రంథ సంచయములోని తొలి ప్రచురణలివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింపచేయాలనే సత్సం కల్పంతో, సముదార దూరదృష్టితో ఫోర్డు ధర్మ నిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణ కర్తలచే అందంగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అంద చేయాలనే ఆదర్శంతో మూడేళ్ళ కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలాలివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కా వ్యాలజోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి,

ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వత శ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూకూడా ప్రచురింపచేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే "ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం" అనేదే దక్షిణ భాషాపుస్తకసంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంత వరకు కృతకృత్యులైనదీ ఇప్పుడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చేపదిసంవత్సరాలవరకు అంతగా కనబడకపోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుతమైనదని అత్యంత ప్రధానమైనదని మాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకోనక తప్పదు. ఇందుకుగల అవకాశాలు అనేకం. అందమైన అచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో వుండే ఈ వుత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల గ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్తవెలుగునీ విజ్ఞానాన్ని అందించగలవు.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి కార్య క్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళ యాళం, కన్నడం – నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీనకాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణాపథ మనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృ తికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈనాలుగు భాషలనూ వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుక చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాష లున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతంకాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషా పరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించు కోడమే నా, యీ సంకోచానికి కారణం. ఈనాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబం ధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలో ఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆలపట్టు. కర్ణా టక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడేప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవ హారలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహం వల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి ప్రశుతిమించిపోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కల్యాణాన్ని కాంక్షించే ఉత్తమగ్రంథాల అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

**పా. వేం. రాజమన్నారు**

# తొలిపలుకు

తెలుఁగు వాఙ్మయమునందలి ప్రాచీన కవుల రచనలను మాదిరిగా నెఱుంగుటకు ఈ సంకలన గ్రంథము ఉద్దేశింపఁబడినది. ఇందు 11 మొదలు 13 వ శతాబ్దమువఱకు నుండిన ప్రసిద్ధులైన కొందఱు కవుల రచనలలోనుండి కొన్ని భాగములు మాత్రమే గ్రహింపఁబడినవి.

ఆంధ్ర వాఙ్మయములో సంస్కృత వాఙ్మయము ననుసరించినట్టివియు, స్వతంత్రములైనవియు అనేక కావ్య జాతులు గలవు. ప్రబంధములు, పురాణములు, కథలు, శతకములు, యక్షగానములు, ఉదాహరణములు, పదములు మొదలైనవానినుండి భాగములు ఏర్చి ఇందు చేర్పఁబడినవి. కొన్ని చాటువులు కూడ ఇందుఁ జేరినవి. తెలుఁగు వాఙ్మయములోని ప్రాచీన ప్రసిద్ధ కవులయొక్క వేర్వేఱుజాతుల రచనలు దిఙ్మాత్రముగా సూచించు ప్రయత్నమునందు భిన్నాభిప్రాయము లనేకములు కలుగవచ్చును. అట్టివి చాలవఱకు రుచిభేదమును వ్యక్తిభేదమునుబట్టి యేర్పడుచుండును.

తెనుఁగు నందలి ప్రాచీన కవులలో కవిత్రయము వారికి ఒక వైశిష్ట్యము కలదు. ఆ రీతినే వారిని మొదట గ్రహించి తరువాత వీలైనంతవరకు కాలానుసారిగా కవులయు, గ్రంథము

లయు వరుస యేర్పరుపఁబడినది. ఇందు ప్రాయికముగా ఆంధ్ర కవి తరంగిణి యనుసరింపఁబడినది.

గ్రంథ పరిమితి ననుసరించి యింతకంటె నెక్కువ భాగములుగాని, అధిక సంఖ్యాకులనుగాని చేర్ప వీలైనదిగాదు.

ప్రాయికముగా కవిత్వ మనునది యేదేని కొంత సంస్కారము గలవాని కుపయోగించును. నవ్య కవిత్వ విషయమున నెట్లుండినను ప్రాచీన కావ్యములలోని రచనలను అవగాహన చేసికొనుటకు కొంత భాషాపాటవము, భావ సంస్కారము ఉండక తప్పదు. కావున ఇందుఁ గొన్ని భాగములు అవగాహన చేసికొనుట మిక్కిలి సామాన్యులకు సులభము కాకపోవచ్చును. రచనావైవిధ్యము, గ్రంథ బాహుళ్యము, భిన్న ఫక్కికలు, అనేక కవి సంగ్రహణము అర్థసౌలభ్యము ఈ సంకలనమునందుద్దేశింపఁబడినవి. ద్వ్యర్థి కావ్యములలోని పద్యములు వ్యాఖ్యానాపేక్షకలవి గావున ఇందు వానినిఁ జేర్పలేదు.

సంపాదకుడు

# విషయసూచిక

---

# నన్నయభట్టు

నేఁడు ప్రచారములోనున్న తెనుఁగు కావ్యములలో నెల్ల మొదటిది ఆంధ్ర మహాభారతము. ఇది సంస్కృతమునకుఁ దెనుఁగు. ఇది ముగ్గురచే రచియింపఁబడినది, వారిలో మొదటివాఁడు నన్నయభట్టు. ఈతఁడు తొలి రెండున్నర పర్వములను మాత్రము తెనిఁగించి విడిచెను. తరువాతి పదునేను పర్వములను మఱికొంతకాలమునకు తిక్కన కవీంద్రుఁడు రచియించెను. ఈ యిరువురు వ్రాసిన భాగము గాక మిగిలిన యరణ్యపర్వపు సగభాగమును ఎఱ్ఱాప్రెగ్గడ పూరించెను,

నన్నయ తాను రచించిన భారత భాగములను రాజమహేంద్రవర ప్రభువగు రాజనరేంద్రునకుఁ గృతి యిచ్చుటవలన, రాజరాజు కాలమునవే అనఁగా క్రీ. శ. 1022—1063 సంవత్సరములలో నన్నయ యుండెననవచ్చును.

సంస్కృత గ్రంధములను దెనిఁగించుట, సంస్కృత పదములను విశేషముగా వాడుట, సంస్కృతమునందలి వృత్తములను విశేషముగా వాడుట, కావ్యములను గద్య పద్యమయముగా నొనర్చుట యను వానిని తరువాతి కవు లీయనను జూచి యనుకరించిరి. కావున నన్నయ ఆంధ్ర వాఙ్మయమునకు తొలిదారి త్రొక్కినవాఁడయి, ఆదికవి యనఁబడెను.

అతఁడు తాను తెనిఁగింపఁ దలఁచిన భారతముయొక్క ప్రశస్తిని ఈ క్రింది రీతిని తెలిపెను.

# భారత ప్రశస్తి

క. జననుత, కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.

క. బహు భాషల బహు విధముల
బహు జనముల వలన వినుచు భారత బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థమగున్.

వ. అని యానతిచ్చిన విని యక్కవివరుండిట్లనియె.

చ. అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే.

వ. అయినను దేవా, నీ యనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెదనని తొడంగి.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కవితార్థయుక్తి, లో
నారసి మేలు నా నితరులక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసకు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

మ. అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీ సురప్రార్థ్యమై.

— ఆంధ్రమహాభారతము. ఆది పర్వము.

(నన్నయ రచించిన భారతమునుండి యీ క్రింది కథ గ్రహింపబడినది. ఇందు వేదవ్యాసుని జన్మను గూర్చిన కథ తెలుపఁబడినది. అద్రికయను నొక దివ్య వనితకుఁబుట్టిన కూతురు కొడుకును గూర్చిన ప్రసంగముతో కథ యారంభింపబడినది. )

# వే ద వ్యా సా వ తా ర ము

వ. అయ్యద్రికయు మానుష ప్రసవంబొనర్చినం దనకు శాప మోక్షణంబగునని బ్రహ్మ వచనంబు గలుగుటంజేసి మీనయోని విడిచి దివ్య వనితయయి దేవలోకంబునకుం జనియె. మఱియును మత్స్యోద రంబునఁబుట్టిన యక్కొడుకు మత్స్యరాజు నాఁబరఁగి ధర్మపరుండయి మత్స్యదేశంబున కధిపతియయ్యె. అక్కూఁతును దాశరాజు తన కూఁతుఁగాఁజేకొని పెంచినం బెరుఁగుచు

క. అంబుజముఖి యక్కన్య ప్రి
యంబొనరఁగ మత్స్యగంధి యనఁగా ధర్మా
ర్థంబుగఁ దన తండ్రి నియో
గంబున నయ్యమున నోడఁగడపుచు నుండెన్.

వ. అంత

చ. గతమద మత్సరుండు త్రిజగద్వినుతుండు వసిష్ఠ పౌత్రుఁడు
న్నతిమతి శక్తి పుత్త్రుఁడఘనాశన ఘోర తపోధనుండు సు
వ్రతుఁడయి తీర్థ యాత్ర చనువాఁడు పరాశరుఁడన్మునీంద్రుఁడ
య్యతివఁదలోదరిం గనియె నయ్యమునానది యోడరేవునన్.

వ. ఇట్లేకతంబ యేకవస్త్రయై యోడ నెక్కవచ్చువారి నిరీ క్షించుచున్న సత్యవతిం జూచి యా మునివరుండు దానియందు మదన పరవశుండై దాని జన్మంబు దనదివ్యజ్ఞానంబున నెఱింగి యయ్యోడ యెక్కి దానితో నొక్కటఁ జనిచని

సీ. చపలాక్షి చూపుల చాడ్పున కెదమెచ్చుఁ
జిక్కని చనుఁగవఁజీఱఁగోరు
నన్నువకౌఁదఁగ యందంబు మదినిల్పు
జఘన చక్రంబుపైఁ జలుపు దృష్టి
యభిలాష మేర్పడునట్లుండఁగాఁ బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁ దిపురు
నతిఘన లజ్జావనతయగు నక్కన్య
పైఁబడి లజ్జయుఁబాపఁ గడఁగు

అ. నెంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్తమయినచోట
సతులగోష్ఠిఁ జిత్త చలన మొందుదు రెందుఁ
గాముశక్తి నోర్వఁగలరె జనులు,

వ. ఇట్లు విగత లజ్జా పరవశుండయి మునివరుండు దన యభిప్రాయం బక్కన్యక కెఱింగించిన నదియును దీనికొడంబడనినాఁడు నాకలిగి యిమ్ముని శాపంబిచ్చునోయని వెఱచి యిట్లనియె.

తరలము తనువు మీన్పొలవల్చు జాలరిదాన నట్లును గాక యే
ననఘ, కన్యకఁ గన్యకావ్రత మంతరించిననెట్లు మ
జ్జనకునింటికిఁ బోవనేర్తుఁ బ్రసాదబుద్ధి యొనర్పు స
న్మని గణోత్తమ, నాకు దోషముని ముక్తి యెట్లగు నట్లుగాన్.

వ. అనిన నమ్మునివరుండు గరంబుం సంతోషించి నాకు నిష్టంబుచేసిన దాన నీ కన్యాత్వంబు దూషితంబుగా దోడకుమని దానికి వరంబిచ్చి నీవు వసువను రాజర్షి వీర్యంబునఁ బుట్టినదానవుగాని సూత

కుల ప్రసూతవు కావని చెప్పి దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు సేర్పడునట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజనగంధి యనియుఁ బరఁగి తత్ప్రసాదంబున ననేక దివ్యాంబరాభరణ భూషితయునయి యమునానదీ ద్వీపంబున నోడసేర్చి

తే. ఎల్లవారును జూడంగ నిట్టిబయల
నెట్లు సంగమ మగునని యింతియన్న
నమ్మునీంద్రుఁడు గావించె నప్పుడఖిల
దృష్టి పథరోధి నీహార తిమిరమంత.

క. పరమేష్ఠి కల్పుఁడగు న
ప్పరాశరు సమాగమమునఁ బరమగు దైకా
భరణకు ననపద్యపనో
హరమూర్తికి సత్యవతికి నమ్మని శక్తిన్.

క. సద్యో గర్భంబున సహి
మద్యుతి తేజుండు వేదమయుఁడఖిల మునీం
ద్రాద్యుఁడు వేదవ్యాసుం
డుద్యజ్జ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్.

క. ఆ యమునా ద్వీపమున న
మేయుఁడు కృష్ణుండు లీల మెయిఁ గృష్ణద్వై
పాయనుఁడనం బరఁగి వచ
శ్శ్రీయుతుఁడు దపంబ వలనఁ జిత్తము నిలిపెన్.

వ. పరాశరుఁడు సత్యవతి కోరిన వరంబులిచ్చి నిజేచ్ఛ నరిగె నంతఁ గృష్ణద్వైపాయనుండు కృష్ణాజిన పరిధాన కపిల జటామండల మండితుండై తల్లి ముందట నిలిచి కర కమలంబులు మొగిడ్చి మ్రొక్కి మీకుం బనిగల యప్పుడ నన్నుం దలంచునది. ఆ క్షణంబ వత్తునని సకలలోక పావనుండఖిలలోక హితార్థంబుగాఁ దపోవనంబునకుం జని యందు మహాఘోర తపంబు సేయుచు

ఉ. సంచిత పుణ్యుఁ డంబురుహ సంభవుసంశము దాల్చి పుట్టిలో
కాంచితుఁడైన వాఁడు నిఖిలాగమ పుంజము నేర్పడన్ విభా
గించి జగంబులందు వెలిఁగించి సమస్త జగద్ధితంబుగాఁ
బంచమ వేదమై పరఁగు భారత సంహితఁ జేసెనున్నతిన్.

—ఆంధ్ర మహా భారతము. ఆది. ప. ౩. ఆ, ౩౩-47 ప.

---

# తిక్కన సోమయాజి

(నన్నయ రచించిన మొదటి మూఁడు పర్వములను విడిచి మిగిలిన పదునైదు పర్వముల భారతమును తెనిఁగించినవాఁడు తిక్కన. ఈతఁడు తన భారత భాగములను హరిహరనాథదేవున కంకితము చేసెను. నెల్లూరిలో రాజయిన మనుమసిద్ధికి నిర్వచనోత్తర రామాయణము నంకితము చేసెను. కాకతీయ సామ్రాజ్యమునకుఁ జక్రవర్తియగు గణపతి దేవునిచే సన్మానింపఁబడెను. ఈతఁడు మంత్రి భాస్కరుని మనుమఁడు. కొమ్మన దండనాథుని కుమారుఁడు. ఈతని కాలము సుమారు : 1220 - 1300.

ఈతనిని కవిబ్రహ్మయని నుతింతురు. రచనము తెనుఁగు భాష యందలి తీపినంతను సారభూతముగాఁ దెచ్చి కూర్చినట్లుండును. క్రింది విషయము అభిమన్యున కుత్తరతోడి వివాహము.)

## అభిమన్యు వివాహము

వ. సాంవత్సరిక దత్తకాలకళా విశేషంబుల మంగళ తూర్యంబులు పెలంగ నత్తెర యెత్తించిన

ఉ. వీనులఁ దియ్య మెక్కమును విన్కిఁ బరస్పర రాగవృత్తితో
మానినఁ జూచు వేడుకల సువ్విళులూరెడు నెమ్మనంబుల
చ్చో నొక యింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుంగుమారుఁడును మార వికారములంకురింపఁగన్.

అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు.

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాఱి
తిపుటమై నునుగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము
నడుగులయొప్పుపైనల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుక మైఁదీవఁ
గలయంగఁ బలుమఱు వెలయుచుండు
వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునఁ జోఁకి మగుడివచ్చు

తే. నొండొరువులలేఁజెమటల నూని గ్రేఁగు
పడిన చాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱవిశాల
నయనదీప్తులు నెఱకువ బయలు పఁడఁగ.

వ. తదనంతరంబ.

తే. ఒండొరుల దోయిళుల నునుపొందఁజేయు
నక్షతప్రకరంబులన్యోన్యమస్త
కములఁబోసిరి మందారకల్పలతలు
విరులు గమియ నొండొంటిపైఁ గురియునట్లు.

చ. లలితతనూవిలాసముల లజ్జకతంబునఁజేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవుసాలక యోరలువాఱుచూపులన్
లలిఁదలఁబ్రాలు వోయునెడలం దగపొందిన నూలుకొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్.



4

తే. చిత్తమున గాఢరాగంబుచేతఁ జూపు
తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర
హించెఁ బల్లవాలంబి మత్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణంబాచరించి

క. పెనుఁగుదుట నిడిన చూతం
బును నవమాలికయుఁ బోలెఁ బొలుపొందిరతం
డును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్.

సీ. కోర్కులు గెడఁగూడుకొని పారమెయ్యంగఁ
జిత్తంబులూఱటఁ జిగురు లొత్తఁ
బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు
మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దఱివేచి చనఁబోయి తడఁబడి మార్గతి
వడిచూపు లాదట బయలు పఱుపఁ
జెమటలతావులు తమలోనఁ గలసిపే
తొక్క సౌరభమయి చొక్కసేయ

గాఢసంస్పర్శ భంగులు గలుగునట్టి
హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్టి పొరిఁ బొరిఁ గ్రమ్ముదేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు.

—ఆంధ్రమహాభారతము, విరా.ప. 5 ఆ. 392-402 ప.

ఇది తిక్కన విరాటపర్వములోని కథ. కీచకుఁడు ద్రౌపదిని బలాత్కరింపఁబోగా ఆమె లొంగినదికాదు. ఆ కారణమున నాతఁడామెను పరిభవించెను.

## కీచకుఁడు ద్రౌపదిని బరిభవించుట

సీ. సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టఁజను విధమునఁ
గ్రూరదానవుఁడు భూచారి నిర్జరకాంతఁ
బొదువ రయమ్మునఁ బోవుభంగి
ఘోరగృధ్రము సుకుమార నాగాంగనఁ
బటుగతి నొడియంగఁ బాఱుకరణిఁ
బ్రిబలబిడాలంబు బాలశారికమీఁద
నడరి సత్వరముగ నరుగు మాడ్కి

తే. సింహబలుఁడత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి
పజ్జఁగడువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొసరించుకయులేక కూలఁదాచె.

వ. అట్టియెడఁ బాంచాలీరక్షకుండైన రాక్షసుండతని డొల్లవేసిన.

క. కీచకుఁడు ప్రేటువడి తన
నీచపుదెస యొరులెఱుంగ నేరకయుండన్
లేచి వెనుకఁ జని విస్మయ
గోచరుఁడై యసురకతనఁ గుంఠితుఁడగుచున్.

వ. ఒడుపు దప్పిన మహానాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్టలంబగు కోపంబు పెల్లున మల్లడిగొనుచుండె నయ్యవసరంబున.

క. తానును నన్నయు నయ్యా
స్థానమ్మున నుండి పవన తనయుఁడసహ్యం
బైన మనోవల్లభ యవ
మానము నాసింహబలుని మదజృంభణమున్.

చ. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులరాల నంగము
ల్గనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్త న
ర్తనఘటనాప్రకార భయదస్ఫురణాపరిణద్ధమూర్తియై.

సీ. నేలయు నింగియుఁ దాళముల్గాఁ జేసి
యేపున రేఁగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వ్రేఁకమైఁ దన్నియాడ
నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచని రొంపి మై నలఁదికొనఁగ
దిక్కులునాలుగు నొక్క చోటికిఁ దెచ్చి
పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ

తే. మిగిలిబ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె.

వ. ఇట్లు పేర్చిన కోపాటోపంబున నవిచారితసమయవర్తనుం డయి వృకోదరుండు గీచకుని గీటడంగింపంజూచి తత్సంబంధ బద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతిఁ దనయలుక లోనివానినకాఁ దలంచుచు నచ్చేరువనున్న యున్నతవృక్షంబు నిరీక్షించి యాననంబు పల్లటిల్ల ధర్మతనయుంగనుంగొనిన నతండు తననయనాకా రంబున వారించి యిట్లనియె.

మ. వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననేవ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీభూజము వంటకట్టియలకై ఖండింపఁగానేటికిన్.

తే. అని నిగూఢభాషణములనయ్యజాత
శత్రుఁడనిలజుకోపరసంబు పేర్మి
సెఱిచె నయ్యన్నదమ్ముల చేష్టితములు
తెల్లముగ నప్డు సూచుచు నల్ల లేచి

సీ. ఎలదీఁగ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీ రేణువొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పునిగుడఁ
దోయజదళముల తుది మంచుదొరఁగెడు
గతిఁ గన్నుఁగవన్రశుకణములురల
నిందుబింబము మీఁది కందుచందబునఁ
గురులు నెమ్మొగమున నెరసియుండ

తే. సర్వజనవంద్యయైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్యమొంది
యవ్విరాటుని సభఁజేర నరిగి నిలిచె.

విరా. ప. అ. 128-138.

---

# ఎఱ్ఱాప్రెగడ

మహాభారతమునందు నన్నయత్రాయఁగా మిగిలిన యరణ్యపర్వతములోని భాగము నీతఁడు తెనిఁగించెను. ఇది సుమారు నాలుగాశ్వాసములగు చివరిభాగము. నృసింహపురాణము, హరివంశము అనుగ్రంథములనుగూడ నీతఁడు రచించియున్నాఁడు. ఈతఁడు రచించెనని చెప్పఁబడు రామాయణము నేఁడు లభింపదు. ఆంధ్రకవులలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన అనువారలను కవిత్రయమందురు. ఈతఁడు సుమారు క్రీ. శ. 1340 సంవత్సరమున గ్రంథరచనము చేసియుండును.

అరణ్యపర్వకథతుదిని, ధర్మరాజు తనదప్పితీర్చుకొనుట కొరకు కొలనియొద్దకుఁబోఁగా నచట నొకయక్షుఁడాతనిప్రశ్నముల కుత్తరము చెప్పినతరువాత నీరుద్రావవలసినదని యాజ్ఞాపించెను. అందులకు నిరాకరించి నీరుద్రావ యత్నించినవారయిన యాతని తమ్ములు తెలివితప్పి పడియుండిరి. తరువాత ధర్మజుఁడచటికి వెడలి యాతనిప్రశ్నలకు సమాధానములొసఁగెను. అట్టివానిలోఁ గొన్ని యిచట నీయఁబడినవి.

## యక్షప్రశ్నలు

క. దినకరునెయ్యది నడపును
దినకరునెవ్వారు గొలిచి తిరుగుదు రద్దే
వుని యస్తమించుఁజేమిట
ననఘ, తదాధారభూత మదియెయ్యదియో

తే. అనిన ధర్మజుఁడిట్లను నబ్జహితుని
నడపుబ్రహ్మంబు సురకోటినడచుఁ గొలిచి
ధర్మచే నస్తమితుఁడగుఁ దపనుఁడమ్మ
హాత్మునకు సత్యమాధారమండ్రు బుధులు
వ. అనిన విని యక్షుండిట్లనియె.

క. ఏమిట శ్రోత్రియుఁ డనఁ జను
నేమిటఁ గడు మహిమవడయు నిమ్మగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁడగు
నేమిట నగు బుద్ధిమంతుఁడేర్పడఁ జెపుమా.
వ. అనిన నతండిట్లనియె,

క. శ్రుతమువలన శ్రోత్రియుఁడగు
నతుల తపోయుక్తిఁ గడు మహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుఁడగు
నతిశయముగ బుద్ధిమంతుఁడగుబుధసేవన్.

వ. అనిచెప్పిన నప్పార్థివోత్తమున కప్పురుషుఁడువెండియునిట్లనియె.

తే. ఏమికతమున భూదేవుఁడెసఁగు దేవ
భావమున నాతనికి సాధుభావమెవ్వి
ధమున నగు నసాధుత్వ మెద్దానఁ జెందు
మానుషుండగు నాతఁడేఁ దానఁ జెపుమ.

చ. అనవుడు ధర్మజుండనియె నధ్యయనంబున దేవభావముం
గను నవనీసుపర్వుఁ డధికవ్రతశీలత సాధుభావ మా
తనికి విశిష్టవృత్తి దిగఁద్రావి యసాధువనవంగ నుండు శౌ
చనియడిలేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుండగున్.

క. నావిని యతఁడాతనితో
జీవన్మృతుఁడెట్టివాఁడు సెప్పుమనుటయున్
దేవాతిథి పితృభృత్య జ
నావళులకు నిడక కుడుచు నతఁడని చెప్పెన్.

చ. విని మగుడంగవాఁడు పృథివీపతిఁజూచి ధరిత్రికంటె క్రిఁ
కన యగువాని నాకసముకంటెఁ గడుంబొడవైనవాని గా
డ్పునకునునెక్కుడై జవముపొంపిరివోయెడువానిఁ బూరికం
టెనుదఱచైనవానిని ఘటింపఁగఁజెప్పుము నాకు నావుడున్.
వ. అమ్మనుజోత్తముండయ్యక్షోత్తమున కిట్లనియె.

ఆ. తల్లి వ్రేఁగుసువ్వె ధరణికంటెను నాక
సంబుకంటెఁ బొడవు జనకుఁ డరయ
గాడ్పుకంటె మనసు గడుశీఘ్రగతి తృణో
త్కరముకంటెఁ జింతగరము తఱచు.

క. ఎయ్యది ధర్మమునకుఁ గుదు
రెయ్యది యాశ్రయము కీర్తి కిమ్మగు మార్గం
బెయ్యది సురలోకమునకు
నెయ్యది సుఖములకు నిక్కమేర్పడఁ జెపుమా.
వ. అని యడుగుటయు

క. అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురండ్రు కీర్తి మహిమ నెలవు దా
నము సత్యము సురపురి మా
ర్గము శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్.
వ. అని యుధిష్ఠిరుండెఱింగించిన నతండు

చ. నరునకు నాత్మ యెవ్వఁడు ఘనంబుగ దైవికమైనచుట్టమె
వ్వరతనికిందదీయమగువర్తన మేమిట నిర్వహించు భూ
వర యతఁడేమిపూని యనవద్యతఁబొందు నెఱుంగఁజెప్పుమీ
వరుదుగనన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ నిట్లనున్.

తే. ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మయయ్యె
నాతనికి భార్య దైవికమైనచుట్ట
మతని జీవిక పర్జన్యుకతనఁ జెల్లు
నతఁడు దానము గొనియాడి యతిశయిల్లు.

చ. అన విని మేటిధర్మమగు నట్టిదియెయ్యది యేదియెప్పుడున్
దనియఁగఁబండియుండు విదితంబుగ నెయ్యది నిగ్రహించినన్
దనరుఁ బ్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వరితోడి సంధి యెం
దును వికలంబుగాదు పరితోషమెలర్పనుపన్యసింపుమా.

వ. అనిదివ్యుండు పలికిన నా దివ్యబోధనుండిట్లనియె.

ఆ. విను మహింస మేటి యనఁ జను ధర్మంబు
యాగకర్మమెపుడు నమరఁ బండి
యుండు మనసు క్రొవ్వు ఖండింపఁగా మోద
మెసఁగు సుజనసంధి యెడలదెందు.

వ. అని తెలిసిన నయ్యక్షుండు ధర్మనందనుతో మనుజుం డెయ్యది పరిత్యజించి సర్వజనప్రియుండును నిశ్శోకుండును నర్థవంతుండును సుఖియును నగు ననిన నమ్మహీపతి యతని కిట్లనియె.

క. దివి ముట్టి ధరణియంతట
నివిడి మెఱయుచుండు నెవ్వని యశోరమ య
ట్టి విశిష్టచరిత్రుఁడు య
శవరాపురుషుండునాఁ బ్రకాశత నొందున్.

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః
ఖములు భూతభావి కార్యములును
నెవ్వనికి సమంబు లిలసర్వధనియనఁ
బరఁగుఁ జువ్వె యట్టి భవ్యుఁడనఘ !

—మహాభారతము, ఆరణ్యపర్వము; 7 ఆశ్వాసము.

# నన్నెచోడుఁడు

"కుమారసంభవము" అను పేరుగల చంపువును అనఁగా గద్య పద్యమయిన కావ్యము నీతఁడు అనువాదముగాఁ గాక స్వతంత్రముగా వ్రాసెను. ఇది యనువాదము గాకపోయినను, సంస్కృతమునందలి కాళిదాస కుమారసంభవమును, ఉద్భటుఁడను కవి వ్రాసెనని చెప్పఁబడు కుమారసంభవమును దీనికి నాధారములు.

ఒరయూరు పురాధిపతి ననియు, టెంకణాదిత్యుఁడ ననియు, కవిరాజశిఖామణి ననియు నీతఁడు తన్నుఁ గూర్చి యీ గ్రంథమునఁ జెప్పుకొనెను.

ఈతని కాలమును గూర్చి కొంత వివాదము కలిగినది. ఈతఁడు నన్నయకంటెను బూర్వుడని కొందఱనిరి. నేఁటి విచారణలలో నీతఁడు నన్నయకుఁ దర్వాతి వాఁడనియు, 12 వ శతాబ్దికాదినుండి యుండు ననియు నూహింపఁబడినది.

శివుని తపస్సును జెఱచుటకు మన్మథుఁడు ఇంద్రునిచేఁ బంపఁబడెను. ఆతఁడు తనచెలికాఁడయిన వసంతుని అనఁగా వసంత ఋతువును బంపెను. ఆ ఋతువునందలి సొగసిందు వర్ణింపఁ బడినది.

## వసంతోదయము

మ. వలరాజామనిఁ బిల్చి వేగమెయి నీ వాసంతి కానందో
హాల మీకాననలక్ష్మికిమ్మనుడు నాహ్లాదంబుతో నెయ్యపు
గ్గలమై యుండ వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకు గెం
దలి రాకయ్యానొ నా (దలిర్చె వడిఁ గాంతారాంత్వరోర్వజముల్.

చ. మలయ సమీరణాభిహతి మ్రాకులనాకులు దుల్లిదుల్లి క్రొ
మ్మొలకలు సాగిసాగి, విరిమోసులఁ గెందలిరొత్తియొత్తి, కు
ట్మలములు గ్రమ్మిగ్రమ్మి, కుసుమంబులు వాసన కెక్కియెక్కి, గు
త్తులు గొని పండిపండి వినుతుల్ దగ నారములొప్పెనామనిన్.

క. ఘోరన నంకుర పల్లవ
కోరక పుష్పఫలవితతిఁ గొమరమరి మనో
హారములై సారములై
యారామములొప్పె మధుసమాగమవేళన్.

సీ. వేదన విరహులు సేదలు సెడిసంధు
లెడలంగఁ బల్లాకు లెడలెఁ దరుల
రాగిల్లు కవల మేఁ దీఁగలఁ బులకంబు
లంకురింపఁగఁ దరులంకురించె
సమ్మదంబునఁ గామిజనులచిత్తంబులు
చిగురొత్తఁ దరులందుఁ జిగురులొత్తె
రతి దోహలమున దంపతుల ముఖాబ్జముల్
విలసిల్ల విలసిల్లె విరులు దరుల

ఆ. నెలమిఁ జిలుకపిండు దొలుమేసఁ జేసిన
లపము వండఁ బండెఁ దరువనంబు
లువిద లింపు మిగుల నూయల పాటలు
పాడ మధు మదమునఁ బాడె నలులు.

క. మదను తలిరెల్లులోయనఁ
బొది గొని కెందలిరు లెసఁగె భూరుహములపై
నొదలెడు రాగాంబుధి బు
ద్బుదములు నానెసఁగె ముకుళములు తోరములై.

ఉ. పొన్నలు పూచెఁ బొన్నలొగిఁ బూవకముందఱఁబూచె గోఁగు లా
పొన్నలుఁ గొండగోఁగులును బూవకముందఱఁబూచె బూరువుల్
పొన్నలుఁ గొండ గోఁగులును బూరువులున్నొగిఁ బూవకుండఁగా
మున్న వనంబునం గలయ మోఁదుగులొప్పఁగఁ బూచె నామనిన్.

క. భావజవిభుఁ డలి శుక పిక
సేవకతతి కెడరు దీర జీతముసేయం
గావెలిఁబోసిన పసిఁడుల
ప్రోవులునాఁ దమ్మిలెలమిఁ బూచె బెడంగై

క. సురపొన్నలపైఁ బ్రాఁకిన
గురువిందలు ననలఁబెరిఁగి కొమరమరె రతీ
శ్వరునకు వసంతుఁడను నొస
పరి సేసిన ముత్తియముల పందిరి వోలెన్.

సీ. పలఁకెడు కొరాకు లలితాస్థిచయముగా
నోలు కొమ్మలు పలుకేలుగాఁగ
బాలపల్లవములు వ్రేలుకెంజెడలుగాఁ
బెనఁగు తీఁగెలు దొడ్డఫణులు గాఁగఁ
గలకంఠ నికరంబు గళమునఁ గప్పుగాఁ
బుప్పొడి మేని విభూతిగాఁగ
ఫలములు వరదాన ఫలములుగా నవి
మాలికల్ రుద్రాక్షమాలికలుగ

ఆ. శంభుమూర్తి దాల్చి సహకారభూరుహ
చక్రవర్తి నవవసంత వేళ
నతిశయిల్లుచుండె నక్కడ గని మది
నుదరి పడి మనోజుఁ డోసరింప.

—నన్నెచోడుని కుమారసంభవము. 4 వ ఆ.

# వేములవాడ భీమకవి

ఈ కవి పేరు మిక్కిలి ప్రసిద్ధముగా వినఁబడుచున్నది. ఈతఁడు వ్రాసెనని చెప్పబఁడు గ్రంథములు లభింపలేదు. కవిజనాశ్రయమను ఛందోగ్రంథము లభించెనుగాని, దాని కర్తృత్వము సందిగ్ధము. ఈతని జన్మనుగూర్చియు విచిత్రములైన గాథలు గలవు.

ఈతనికి శాపానుగ్రహసామర్థ్యములురెండును గలవఁట. ఈతఁడు పదునొకండవ శతాబ్దమున నుండి యుండవచ్చును.

చోడ గంగును గూర్చియు, మైలము భీమన నుద్దేశించియు, రాజ కళింగ గంగును శపించినపట్టునను ఈతఁడు చెప్పిన చాటుపద్యములు ఇచట నీయఁబడినవి.

## చాటువులు

### చోడగంగు:

ఉ. భోజుఁడు మంకు, ధర్మజుఁడు బొంకు, శచీపతి రంకు, కల్వపూ
రాజు కళంకు, దైవతధరాజముదొంకు, పయోధియింకు, నం
భోజభవుండు పంకు, ఫణిభూషణదేవుఁడు సంకు, పద్మినీ
రాజహితుండు క్రుంకు, సరిరారు గుణంబుల నీకు ధారుణిన్.

## మైలమభీముఁడు :

చ. గరళపుముద్దలోహ మవగాఢమహాగనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపు కోఱలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయ, లయకాలుఁడుకమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమభీముని ఖడ్గసృష్టికిన్.

## రాజకళింగగంగు :

ఉ. రామునమోఘబాణమును రాజశిఖామణికంటిమంటయున్
భీముగదావిజృంభణ ముపేంద్రునివజ్రము చక్రిచక్రమున్
దామరచూలిప్రాఁతయును దారకవిద్విషఘోరశక్తియున్
వేములవాడ భీమకవి వీరునితిట్టును రిత్తవోవునే?

—వేములవాడ భీమకవి చాటుపద్యమణి మంజరి.

# యథావాక్కుల అన్నమయ్య

ఇతఁడు శివకవి. యథావాక్కుల వారని యీతనికి బిరుదనామమై యుండును. అనఁగా, నీతఁడన్న మాట జరుగునని యర్థము.

ఆంధ్రవాఙ్మయమున మొదటిశతకముగాఁదోఁచునట్టి సర్వేశ్వర శతకమును ఈతఁడు 1242 వ సంవత్సరములో రచించెను. అందలి మూఁడు పద్యములు క్రింద నుదాహరింపఁబడినవి.

## సర్వేశ్వరుఁడు

మ. అమరంగా స్ఫుట భక్తి నాటకము భాషాంగక్రియాంగాభి ర
మ్యముగాఁ జూపిన మెచ్చి మీరలు పురేయన్నంతకున్ యోని దే
హములన్ రూపులు వన్నుకొంచును నటుండై వచ్చి సంసార రం
గములోనంబహురూపమాడు మెలయంగా జీవి సర్వేశ్వరా!

మ సతి వేడ్కందనప్రాణవల్లభునితో సంయోగమాసించుఁగా
కతనిం బ్రార్థనచేసి సొమ్ముగొనిపో నట్లాడునే తద్జ్ఞుఁడీ
క్షితి నీభక్తియ వేఁడుఁగాక మఱి నీశ్రీపాదముల్ గొల్చి కు
చ్చిత కామ్యార్థములొంద వేఁడుకొనునే చింతింప సర్వేశ్వరా!

శా. కాయంబన్నది వారి బుద్బుద సదృక్షంబందు రూపింప లేఁ
బ్రాయంబన్నది శారదాంబుదతటిత్ప్రఖ్యంబగుందత్సుఖ
శ్రేయంబన్నది మాయ యిట్లెఱిఁగియున్ శీఘ్రంబె నీధ్యాన సం
స్థాయిన్ భావనఁజెందఁ డేమిటి కయో సంసారి సర్వేశ్వరా!

—యథావాక్కుల అన్నమయ్య - సర్వేశ్వర శతకము.

# కేతన

ఈతని పూర్తిపేరు మూలఘటిక కేతన. సంస్కృతమున దండి మహాకవిచే వ్రాయఁబడిన దశకుమారచరితమను గద్యగ్రంథమును ఈతఁడు చంపువుగా తెనిఁగించి తిక్కన కవికిఁ గృతి యిచ్చెను. తన కవిత్వమును తిక్కనమహాకవి మెచ్చుకొనెననుటయే దాని ప్రాశస్త్యమును దెలుపుచున్నది. ఈతఁడు క్రీ. శ. 1250 సంవత్సర ప్రాంతమున నుండి యుండవచ్చును. పై గ్రంథమును గాక విజ్ఞానేశ్వరీయమును, ఆంధ్ర భాషాభూషణమును ఈతఁడు రచించెను. క్రింది పద్యములలో నీతఁడు తిక్కన కవీంద్రుని వర్ణించిన విధము తెలియ నగును.

## తిక్కన ప్రశంస

సీ. సుకవీంద్ర బృంద రక్షకుఁడెవ్వఁడనిన పేఁ
డను నాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్త నిత్యస్థిత శివుఁడెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాఁడు
దశదిశా విశ్రాంత యగుఁడెవ్వఁడనిన వీ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళా చణుఁడెవ్వడనిన వీఁ
డని చూపుటకు గుఱియైనవాఁడు

తే. మనుమసిద్ధి మహేశ సమస్తరాజ్య
భారధౌరేయుఁడభిరూప భావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్య కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అగుననఁగొమ్మయ తిక్కఁడు
జగతి నపూర్వార్థ శబ్దచారుకవితమై
నెగడిన "బాణోచ్ఛిష్టం
జగత్త్రియం" బనిన పలుకు సఫలంబయ్యెన్.

క. కృతుల రచియింప సుకవుల
కృతులొప్పఁ గొనంగ నొరునికిందీఱునె వా
కృతి నిభుఁడు వితరణ శ్రీ
యుతుఁడన్నమసుతుఁడు తిక్కఁడొక్కఁడు తక్కన్.

క. అభినుతుఁడు మనుమ భూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయ కవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్.

—కేతన. దశకు. చ. ప్ర. ఆ. 89-92

---

# రంగనాథుఁడు

ఈ పేరున నొకకవి సుప్రసిద్ధుడు. ఆతఁడు వ్రాసెనను ద్విపద రామాయణము కర్తృత్వమునెడ వివాదము కలదు.

ఆతని చాటువులనునవి కొన్నియుదాహృతములు.

కాలము సుమారు సం. 1275 ము.

## రంగనాథుని చాటువులు

చ. అదలనితేరు తేరునకు నాదరువై తగువిల్లు వింటికిం
గుదురగునారి నారి పయిఁ గూర్కు-శరంబు శరంబు బొడ్డునం
బొదలినయంత యంతముఖముల్ నిజవాసములైన గుబ్బముల్
చెదరక నీకు నెట్టిపని సేయునయా ! గిరిజాధి నాయకా !

సీ. ఓజు చేముట్టక యొగ్గానఁ బట్టక
చక్కఁగా దివిఁ బాఱు చక్రములును,
లాయానఁ గట్టక లలిమేఁత వెట్టక
వర్ణహీనంబైన వారువములు,
తవన వెట్టక జీవితము కాసు ముట్టక
సత్త్వసంపదఁ జూపు సారధియును,
కడచీలఁ దట్టక ఘనముగా మెట్టక
గంభీర సంపద గలుగు నిరుసుఁ

గీ. గలిగి తనరారు నరదంబుగడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందు శేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁ గాత :

ఉ. గోశత పంచవార్ధులును గోయుగవార్ధులు గోత్రివార్ధులున్
గోశర వార్ధులున్ విదితగోశత (వార్ధులు) పంచవార్ధులా
కేశవతల్ప పద్మభవ కేకిపవాహన దానవేశ దే
వేశులకిచ్చునట్టి పరమేశ్వరుఁడీవుత మాకభీష్టముల్.

—ప్రబంధ రత్నావళి, 119-120 పు. 407-408 ప-

# గోనబుద్ధారెడ్డి

రంగనాథరామాయణ మను పేర ప్రసిద్ధమై ద్విపదచ్ఛందస్సులో వ్రాయఁబడిన యొక గ్రంథమునకు గోనబుద్ధారెడ్డి కర్తయని యొక వాదము గలదు పుస్తకమున నీతని పేరున్నది. రంగనాథుఁడను నొక కవి యీ గ్రంథమును వ్రాసి యీతని పేరందు వ్రాక్రుచ్చెనని మఱియొక వాదమున్నది. రంగనాథరామాయణము చాలవఱకు జనులలో వ్యాప్తిలో నున్నది.

గోన బుద్ధారెడ్డిగాని, యాతని పోషణమునందిన రంగనాథుఁడు గాని యీగ్రంథమును క్రీ. శ. సుమారు 1300 సంవత్సరముల ప్రాంతమున రచియించియుండునని యూహింపఁబడినది.

రావణునితమ్ముఁడైన విభీషణుఁడు శ్రీరాముని శరణుపొందుటకు వచ్చిన వృత్తాంతము ఇందు వర్ణింపఁబడినది.

## విభీషణ శరణాగతి

అంత విభీషణుఁ డాకాశవీథి
సంతసంబున మంత్రిజనులతోఁ గూడి
వచ్చుట గనుఁగొని వనచరులెల్ల
రచ్చెరువడి చూచి రటు తలలెత్తి
రెత్తిన రాముచే నింద్రారి యింక
నెత్తఁడు తలలు; పేరెత్తఁ డతఁ్కాలము;

నెత్తెడు భయముఁ బోనిడి సురలార
యెత్తుఁడాత్మలఁ దలలెత్తుఁడన్మాడ్కి
అప్పుడు సుగ్రీవుఁ డగచరాధిపులఁ
దప్పక కనుఁగొని తగవారికనియె:
"వనచరులార, యీవచ్చు రాక్షసునిఁ
గనుఁగొనుఁ డదె వీఁడఖండ విక్రముఁడు,
ఘనమైన పర్వతాకారంబుఁవాడు,
తనరార శస్త్రముల్ దాల్చినవాఁడు,
మిక్కిలి పొడవున మెఱసినవాఁడు,
స్రుక్కక యిటు వచ్చుచున్నాఁడు వీఁడు."
అనపుడుఁ గడఁగి యయ్యగచరాధిపులు
ఘనమైన గిరులు వృక్షములు సేపట్టి
"మముఁబంపు సుగ్రీవ, మముఁబంపు దేవ
సమరంబులో దైత్యుఁజంపెద" మనుడు
నా విభీషణుఁడనె "నగచరులార,
మీవాఁడ నిటు సంభ్రమింపంగ వలదు
రావణుతమ్ముండ రాక్షసోత్తముఁడ
భావింప నేను నిష్పాప మానసుఁడ
శరణని యారామ జనపాలుఁ గాన
నరుగుదెంచిన వాఁడ నాలంకనుండి.
రావణుతో నేను "రామభూపాలు
దేవి నిమ్మ"ని పెక్కుతెఱఁగుల నంటి.
ననవుడు నామాట కతఁడు కోపించి

తన సభలోపలఁ దన్నె నన్నట్టి.
తన్నియంతటఁ బోక తనవీటిలోన
నున్నఁ జంపెదనని యోట లేకాడె.
నేనును వెలువడి యీరామచంద్రుఁ
గానంగ వచ్చితిఁ; గాని చింతింపఁ
గపటుండఁగాను; నిష్కపటమానసుఁడ;
కపులార, నాయెడఁ గపటంబు లేదు.
సభయుండ నగునాకు సంప్రీతి వెలయ
నభయమిప్పింపుఁడీ యవనీశుచేత."
ననవుడు సుగ్రీవుఁడారాముఁ గానఁ
జని విన్నపము సేసె సవినయుండగుచు:
"రావణునితో నల్గి రాయిడి వుట్టి
దేవ, వీఁడొక్కఁడేతెంచి యున్నాఁడు;
మొత్తంబుతో నభంబున నున్నవాఁడు;
చిత్తంబు మీమీఁదఁ జేర్చియున్నాఁడు;
అమరారి' తమ్ముఁడ ననుచున్నవాఁడు;
విమల వాక్యంబుల వెలసినవాఁడు;
ఆదిత్యకులనాథ, యభయ మిమ్మనుచు
మోదవాక్యంబుల మొనసినవాఁడు
మీకృప కలిమి యేమ్మెయి నున్న యది యొ
నాకుఁ జూడఁగ వీని నమ్మంగరాదు.
నరనాథ, కపటంబునకుఁ బుట్టినిల్లు
లరయ రాక్షసులు గా కన్యులు గలరె:

ధనుజాధినాథుని తమ్ముఁడేమిటికిఁ
జనుదెంచు? నిన్నీచుఁ జంపగాఁ వలయు."
ననుడు నంతటిలోన నాంజనేయుండు
వినయ సంభరితుఁడై విభునకిట్లనియె:
"దనుజాధి నాథుఁడుద్దండ కోపమునఁ
దను సభలోపలఁ దన్నె నన్మాటిక్క
నఖిలంబు నెఱుఁగంగ నాడె నీయసుర
నిఖిలేశ, యీమాట నిజముగా నోపు.
నుడుగక మనలకై యుచితమాడుటయు
వెడలఁ ద్రోచిన వాని విడిచివచ్చుటయుఁ
గలుగ నోపును గాని కపటంబు గాదు.
వలవదు శంకింప వసుధేశ, యితనిఁ.
గపటమానుసులెట్టి క్రమమున నున్నఁ
గపటమింతటిలోనఁ గానంగ వచ్చు.
నితని మాటలలోన నేమాటనైనఁ
గృతకమై తోఁపదు కీడన రాదు.
మనుజేశ, దనుజుల మర్మజ్ఞుఁడితఁడు
మనదెస నుండుట మానైన నీతి.
నను రావణుఁడు వట్టినాఁడు బంధించి
యెనలేని బాధల నేఁచుట సూచి
యితఁడు నాకై పెక్కు హితవులు పలికె
నితని చిత్త స్థితి యెఱుఁగుదుఁ గొంత."
యనిన మాటలు దన యాత్మకు నెక్క

పనజాప్తసుతుఁజూచి వసుధేశుఁడనియె:
"నర్కజ, యితఁడు మేలౌట గీడౌట
తర్కింపనేటికి? ధర్మంబు త్రోవ
శరణని వచ్చిన శత్రువునైనఁ
బరికింపఁగా రాచపాడి రక్షింప.
నొకకపోతము డేగ యుద్ధతిఁ దఱుమ
వికలభావంబున వేగంబ వచ్చి
శిబి మాటు సొచ్చెఁ; జొచ్చిన డేగ యడుగ
శిబి తను విచ్చి చెచ్చెర గువ్వఁ గాచె
నపకీర్తిఁ జెందక యార్తిఁ జేకొన్న
కృప యశ్వమేధ సత్కృతి ఫలంబిచ్చె.
నీవిభీషణుఁడేల యింక సుగ్రీవ.
రావణుఁడైన గర్వము దక్కి వచ్చి
శరణన్నఁగాతు నేచందంబునందు;
మరియాద యిట్టిది మాకులక్రమము.
అభయమిచ్చితి వేగ యర్కజ, పోయి
అభయుని నవ్విభీషణుఁదోడితెమ్ము."
అనవుడు సుగ్రీవుఁడా రాముకృపకుఁ
గనుబ్రాల్చి యటు శిరఃకంపంబు చేసి
"పరికింప నీవలెఁ బగవాని తమ్ము
శరణన్నఁ గైకొను సత్కృపారసము
నీకుఁగాకెందు నేనృపులకుఁ జెల్లుఁ
గాకుత్స్థతిలక, నిక్కము ధాత్రిలోన."
నని పల్కి సుగ్రీవుఁ డాకాశమునకుఁ

దన సేనతో సముద్ధత గతి నెగసి:
"చేకొని యభయంబు శ్రీరాముఁడిచ్చె
నీకు విభీషణ నిక్కంబు నమ్ము.
ర"మ్మని కపిరాజు రాక్షసరాజు
నిమ్ములఁ గౌఁగిట నెనయంగఁ జేర్చి
తోడ్కొనివచ్చి సంతోషంబుఁ గృపయు
వేడ్కయు నెసఁగ నవ్విభుఁ గానుపించె.

రంగనా. రా. 347-349 పు.

---

# భాస్కరుఁడు

భాస్కర రామాయణమనుపేర తెనుఁగున ప్రసిద్ధమయిన యొక చంపూగ్రంథము మిక్కిలి వాడుకలోనున్నది దీనికి కర్త భాస్కరుఁడని ప్రసిద్ధి. కాని యిందలిభాగములు వివిధకవులచే రచింపఁబడినట్లు నిదర్శనములున్నవి. మంత్రిభాస్కరుఁడను నాతఁడు కొంతభాగము వ్రాసియుంచఁగా మిగిలినభాగములను హుళక్కిభాస్కరుఁడును, మల్లికార్జునభట్టును, కుమారరుద్రదేవుఁడును పూరించినట్లు ఊహింపఁబడినది. మంత్రిభాస్కరుఁడు సుమారు 1175 సంవత్సరప్రాంతమున నుండి యుండును.

పై రామాయణములోని బాల కిష్కింధ సుందర కాండములను మల్లికార్జునభట్టు వ్రాసెనని గ్రంథమునందలి గద్యలనుబట్టి తెలియుచున్నది. క్రింది భాగమును వ్రాసెననుకొనుచున్న మల్లికార్జునభట్టు కాలము 1280-1330 అయి యుండునని యూహింపఁబడినది.

తన పతియయిన వాలి శ్రీరామునిచే చంపఁబడినప్పుడు తార శోకించిన ఘట్టము ఈ క్రింద నీయఁబడినది.

## తారా విలాపము

వ. శోకంబు సైరింపఁజాలక యత్తార యధిక దుఃఖావేశంబున.

ఉ. వాలినిఁ గౌఁగిలించుకొని వల్లభ యంగదు నీ కుమారు ని
ట్లేల ప్రియంబుతోఁ బిలువ వేటికి శోకము మానిపింప వి

స్థైల సుతుండు నేలఁబడి యేడ్వఁగ నక్కన గ్రుచ్చి యెత్త వి
ద్యాలకుఁడింక నెవ్వరికి బంటయి కొల్వఁగ నేర్చు నక్కటా.

చ. కదనమునందుజర్జరితకాయుఁడవై యురుర క్తపూరముల్
ప్రదరముఖంబునన్ వెడల బాహుబలంబడి బాణవేదనం
బొదవఁగ నేలఁగూలి యిటులుండఁగఁ జూచుచునున్నదాన నా
హృదయము వేయివ్రక్కలయిబాల్గను మైపముచేమిసేయుదున్.

క. తగదనక యనుజు భార్యం
దెగువమెయింజెఱిచితీవు ధృతి సెడి తోఁబు
ట్టుగుఁ బురము వెడల నడిచితి
పగగొని యాఫలము నిన్నుబడవైచె నిటన్.

వ. అని విలపించి సుగ్రీవుం గనుంగొని

మ. అని నీ యగ్రజు వాలి నక్కసుతు నేర్పారంగ శాసించి తిం
క నశంకంబుగ సాధ్యమయ్యెరుమతోఁ గామోపభోగంబు ల
త్యనురాగంబునఁ బొందుచుం బ్లవగ రాజ్యంబేలు దుఃఖించుచు
న్న ననుందోడి సపత్నులంగని మదిన్ నందింప కానక్తితోన్.

వ. అని పలికి దుఃఖావేశంబున

చ. తన పతి పాదమూలమున దైన్యముతోఁబడి తార యేడ్చుచున్
వనచరనాథ, నీవెనుక వచ్చెదఁ బాయఁగఁ జాల నిన్ను నా
ఘనతర మాంసఖండములు కాకులు గ్రద్దలు జంబుకాదులున్
దనియ భుజింపఁ బ్రాణములు దద్దయు సమ్మతి నీకునిచ్చెదన్.

చ. మరణము నిత్యమైనయెడ మానుగ నాథునితోడఁ బోక దు
ర్భర విధవాత్వదూషణము బాల్పడి పుత్త్రిఁడు బ్రోవఁ గొన్ని వా

నరములు కష్టజీవనము సల్పి తగన్ మృతిఁబొంది ప్రేతమై
నరకముఁ బొందఁ జాలఁదగ నాథునితోడన నాకమేఁగెదన్.

చ. తన ప్రియపుత్త్రిఁడంగదుఁడు పైస్యమునొందఁగడించినాథుతో
ననుగమనంబుసేయుటిది యర్హముఁగాదని ప్రాకృతాంగనల్
కనుకని నాడనిమ్ము చనఁగాఁ బతితోఁపిద నాకు లోకము
త్యనుమతుఁడైనఁగాక ఖలుఁడైనను నాథుఁడ లోకమింతికిన్.

క. జనకునితో సోదరుతోఁ
దనయునితోఁ దాతతోడఁ దగుమైత్రిం జ
చ్చిన సతికిం బతితోఁ జ
చ్చిన గతిఁ గైవల్యపదము చెందం గలదే.

క. జనని యొక యెగ్గు సేసినఁ
దనయుఁడు గోపించుఁ గాంత తనతోఁ గోపిం
చినఁ బ్రియపడుఁ బతి యిటు చె
ప్పనిలన్ సతికిఁ బతిఁ బోలు బంధుఁడు గలఁడే.

వ. అని పలికి తనభూషణంబులు పుచ్చి తొలంగవైచి యప్పుడు భూషణవిహీనయై చంద్రునిం బాసినఁ శర్వరియుంబోలె బాష్పసంరుద్ధ నయనయై యుపరాగయుక్త రోహిణియుంబోలె విలసిల్లి దివినుండి పడినట్లు నేలఁద్రెళ్ళి పాంసుదూషితసర్వాంగియై యొడలెల్ల ధూళిఁ బ్రుంగఁ బొరలి యేడ్చుచు మఱికొంత వడవునకు లేచి సుగ్రీవుని జూచి యధిక రోషావేశంబున

క. పతి వధయ శత్రువధ సతి
కతివకుఁ బతిలేని జీవమదియేటికి నా

పతిఁ జంపితి నీచేఁ జ
చ్చితి నేనును నీవు బ్రతుకు సేమము తోడన్.

క. అని తార పల్క లజ్జా
వనతాననుఁడై మనంబు వందఁగ నిలఁగ
న్గొనుచు మఱుమాట పల్కక
యినతనయుండూరకుండె నెంతయు భీతిన్.

వ. అప్పుడా తార వనచర స్త్రీలు బహువిధంబుల బోధింపఁ గొంత సహించి క్రమ్మఱ దుఃఖం దెత్తి వాలి నాలింగనంబు సేసి యంతస్గతంబున

క. సంగత జాతాంగ పరి
ష్వంగాంచిత సుఖసుకంటె శవమై యిట్లు
న్నం గాంతుని యంగ పరి
ష్వంగము గావించుటధిక సౌఖ్యము నాకున్.
వ. అని పలికి

క. నీ మానము నీ గుణములు
నీ మన్ననతోడి చూపు నీ మధురోక్తుల్
నీ మందస్మిత వదనము
నీ మోహముఁ దలఁచి మనము నీఱుగఁ జొచ్చెన్.
వ. అని విలపించి రామచంద్రు నుద్దేశించి తార యిట్లనియె.

మ. పరుతోఁ బోరఁగఁ బొంచి నావిభునిఁ జంపంబాడియే నీకులా
వరివై వెనంబొడసూపి కయ్యమున నిల్వంజూచి దోశ్శక్తిమైఁ
బరగం జంపఁగ రాదె నీ కహిత మాపాదించెనే యీ కపీ
శ్వరు నిష్కారణ మేలచంపి తతి దోషంబిట్లు గావింతురే.

క. వనమున వన్యాశనులయి
యొనరఁగ మనువారి రామ, యూరక చంపం
జనునె! మహాత్ములు వనితల
వనచరుల నధర్మమనుచు వధియింప రిలన్.

తే. ఇత్తెఱంగు దోషమగుట నీవెఱుఁగకునికి
వాలిపాలి యభాగ్యంబు, వాలిపత్ని
నయిన నానోముఫలముగా కరసి చూడ
నిజము నీ వేమిసేయుదు నృపవరేణ్య!

క. నరవర, యూపలకొ౦టకున్ఁ
వరఫలయుత చూతతరువు నఱకఁగ నగునే
ధరణిజతోడనె నీసురు
చిరపుణ్యగుణమ్ములెల్లఁ జెడిపోయెనొకో!

ఉ. అక్కట! నీవు వానరసహాయముగోరిన వాలి పంపఁడే
దిక్కులకెల్ల వానరుల దిగ్గునఁ దాఁజని భూరిశక్తిపై
రక్కసులన్ బలాఢ్యుఁడగురావణునిన్ వధియించి సీత నీ
వక్కజమంది చూచి ముదమందఁగ ముందటఁ దెచ్చి పెట్టఁడే.

—భాస్కర. రా. కిష్కిం. కా. 279-303.

---

# పాల్కురికి సోమనాథుఁడు

వీరశైవమతమునకు ప్రధానమైన బసవపురాణమను గ్రంథమును సులభమగు శైలిలో నితఁడు రచించెను. ఇందలి కథలు భక్తి ప్రధానములై రసవంతములై యుండును.

ఇతఁడు 1240-1320 సంవత్సరముల నడిమికాలములో నుండెనని యూహింపఁబడినది. గొడగూచి యను పేరుగల యొక బాలభక్తురాలి కథ క్రింద నీయఁబడినది.

## గొడగూచి కథ

శివదేవుఁడన నొక్క శివభక్తియుతుఁడు
సువిదయుఁ దానుఁ బొర్గూరి కేఁగుచును
రూపించి కడగొట్టు పాపఁ దారింటి
కాపిడి "యటయిట కదలకు మమ్మ !
పడుచులతో నాడఁ బఱవకు మమ్మ !
నొడివిన మాత్రవతం బెడవకుమమ్మ !
గుడికేఁగి నిత్యంబుఁ గుంచెఁడు పాలు
బడరున కారగింపఁగ బెట్టుమమ్మ
నమ్మిపోయెదము సుమ్మమ్మ ! మాతాకు
మమ్మ ! మాయమ్మ ! మాయక్క ! మాతల్లి !

కొమ్మ, నీకొక మంచిబొమ్మయు లెస్స
బొమ్మపొత్తికలును బోయి తెచ్చెదము"
అని యప్పగించుచు నరిగిన, వారి
తనయ గాళ్ళ మొగంబుఁ దాఁ గడిగికొని
మంచి గంగుడపాలు మరగంగఁ గాఁచి
కుంచెఁడు గోరతోఁ గొలిచి చేపట్టి
కోరయు బొత్తిన కొంగునఁ గప్పి
భోరునఁ జని శివాగారంబుఁ జొచ్చి
కోరముందఱఁ బెట్టి ధారుణి మ్రొక్కి
యారగింపవె దేవ, యని విన్నవించి
పిఱుసని యొక్కింత మఱువున నిలిచి
మఱి వచ్చి చూచుడు గఱిగంటి గామి
బాల దల్లడమంది భయమునఁ బొంది
"పాలేల యారగింపవు లింగమూర్తి!
కాఁచుట చాలదో కమ్మ పల్వమినొ?
ప్రాఁచియో విఱిగెనో పదుచ నేననియొ?
ప్రొద్దెక్కెనో యొండెఁ బొగయు వచ్చెడినొ?
బుద్ధి పుట్టదొ నెయ్యి వోయకుంటితినొ?
కడు వేఁడియో? నీరుగలసిన వనియొ?
పడవాద్యములు లేక యేనె రెచ్చిననొ?
చాలవోయివి యాలపాలు గావనియొ?
పాలపైఁ జిత్తమేఁ బఱపితి ననియొ?
కోరబెండగనో? కుంచెఁడు లేదొ?

ఆరగింపఁగఁ బెట్ట నేరకుంటితినొ?
మీఁదు వోయినవనో మీఁగడ లేదొ?
యేఁదెచ్చునెడనెవ్వరేఁ జూచిరనియొ?
యూరకేమిటికిఁ బాలొల్లవు ద్రావఁ?
గారణం బేమేనిఁ గలదేనిఁ జెపుము.
నిక్కంపుటాఁకలి నీకు లేదేని
గ్రుక్కెఁడైనను గొని చిక్కించు నాకుఁ
గడుపునకియ్యెడ గుడగుడ లేల
కుడికెండు దెత్తునా గుజ్జు నోగిరము.
మూలపన్నారుల యాలోవిలోనఁ
బోలెలున్నవి వంపువోయి తెచ్చెదను
ఉట్టిపై బానలోనున్నది నెయ్యి
యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే చెపుము.
కుండెఁడున్నది వోయి కొనివత్తుఁ బుల్ల
కండంబుపలెనేని గ్రక్కునఁ జెపుము
అచ్చన యెల్లి మాయయగారి నగరఁ
జెచ్చెరఁ బిల్వవచ్చెద నారగింపు
మా శివసోదరి మఠమునఁ గలదు
పాసెంబు దెచ్చెదఁ బాలు మున్ ద్రావు.
షోడశపండువు నూడఁబోదండు
షోఁడిగా నీపాల పురహర, కొనుము.
వీరభద్రుని జాత్ర వేళనిచ్చండి
యేదొప్పఁ బనిచెద నీపాలు ద్రావు.

మెడమడుగేమిటి కీపాలలోని
కడుకులు దెచ్చెద నట్లైనఁ జెపుమ.
యిత్తటి శిశువుండ నెట్టులంటేని
పొత్తునన్నైనను నెత్తి త్రావుదము.
పిన్నపన్నారులు పిన్నిబొమ్మలును
నిన్ని గూడడుకులు నెన్నేనిఁ బండ్లు
నాకెల్లి మావారు నలిఁదెత్తు రపుడు
నీకు నిచ్చెదఁగాని నీయానత్రావు.
పాలును జల్లారెఁ బలకవు తోడ
నేలయాలింగ, నన్నేఁచెద" ః వనుచుఁ
బాప యీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కుఁ
గోపించు భంగించుఁ గుప్పించు నఱచుఁ
గటకట వాపోవుఁ గరములు విఱుచుఁ
దటతట నేలతోఁ దాటించుఁ గాళ్ల
ధారుణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ
గోర దిక్కునుజూచు మారారిఁ జూచు
బుజ్జగించును వెడ్లు బడ్లును బెట్టు
నిర్జీవి క్రియఁబడు నివ్వెఱఁగందు
నెప్పటి యట్లేడ్చు నెలుఁగెత్తి పిలుచుఁ
దొప్పనఁబడుఁ గోరదొలఁగంగ నూకు
వెఱచి ముందఱఁబెట్టు మఱిపలుమాఱు
నెఱఁగుఁ బాదంబుల కెట్లు ద్రావమిని

నిట్టైనఁగాని పాలేఁ ద్రావననవు
ముట్టవు మూరొక్కన వట్టె యున్నవియు
నీవారగింపమి మావారు విన్నఁ
జావనడ్తురు నన్ను సంశయంబేల
తనకు నెప్పుడుఁ జావు తప్పదు మగిడి
చన నిచ్చటనె చత్తు నరివోదు ననుచుఁ
దన తల శివునితోఁ దాఁకించుకొనఁగఁ
జనునంతలోనన చక్కనఁ బట్టి
యారుద్రుఁడతిదయా హసితాస్యుఁడగుచుఁ
గోరతోఁ బాలెత్తుకొని యారగింప
"నన్నింత యేఁచితి పిన్నగాఁ జేసి
మిన్నకపోదు మా యన్నకుఁ జెప్పి
మఱికదా యున్నది మాటలింకేల
కఱకంఠ ! యింతయు మఱవకు" మనుచుఁ
గుడుక దెమ్మని పుచ్చుకొనుచు నబ్బాల
పడిగొని యింటికి వచ్చి నిత్యమ్ము
నిట్ల కొంపోయి తా నిచ్చుచునుండ
నట్ల శివుండుఁబాలారగింపంగ
నూరికిఁ బోయిన వారెదుర్గాఁగఁ
దారేఁగుఁదెంచు నత్తఱిఁ దొంటియట్ల
మృడుఁడు పాలారగించుఁడు బాలరిత్త
కుడుకఁజేతను బట్టికొని యేఁగుదేరఁ

బొడగని 'యిటు యెందుఁబోయెదు రిత్త
కుడుక యెచ్చటినుండి కొనివచ్చె'దనిన
'మీరు సెప్పినయట్ల మృదునకుఁ బాలు
కోరతోఁ గుంచెఁడు కొలిచి గొంపోవ
నారగింపఁగ మ్రొక్కి యసయంబు నిట్లు
కోరయిమ్మని పుచ్చికొనివత్తు'ననిన
"నేనాఁటఁ ద్రావుఁ బాలీశుండు పడుచ
కా నీవ త్రావితో కాదేని తోడ
నాడెడు పడుచుల కచటఁ బోసితివొ ?
యెడఁ జల్లితివొ, మైయెఱుఁగవుగాక
తన్ను మహాభక్తపతి యుద్దేంసిచి
'పన్నుగా నారగింపవేదేవ' యనుచు
నతిభక్తిఁ బ్రార్థింప నారగించుటయు
క్షితిదుర్లభంబన్న నితరుల తరమె !
యెట్టు నమ్మెడిదంచుఁ బట్టి తిట్టుచును
'నట్టెనఁ జూతమం' చాపుయినాఁడు
బాలచేతనె తండ్రి వట్టించుకొనుచు
లీలతో గుడికేఁగి పాలతోఁ గోర
ముందటి క్రమమున ముందఱఁ బెట్ట
నందికొనండయ్యె నా లింగమూర్తి.
బాలముగ్ధత్వంబుఁ బ్రవిమలభక్తి
యీ లోకమున వెలయింపంగఁ దలఁచి

యాశివదేవుఁడు నంతఁ గోపించి
"యోసి, నేఁడేల పాలొల్లండుద్రావ ?
ముక్కంటి ముట్టెనే మూర్ఖాన్న చెపుమ
పెక్కులు క్రలితి వక్కజంబుగను
శివునకునని యుద్దెసించిన పాలు
దవిలి నిత్యంబును ద్రావిన ద్రోహి !
పొట్ట వ్రచ్చెద నెందుఁబోయెద" ఎనుచు
గట్టుగ్రమునఁ గూడ ముట్టుడు మున్న
బాల వాపోవుచు బలువిడి నేఁగి
హాలింగ ! హాలింగ ! హాలింగ ! యనుచుఁ
జేతికోరకు మున్న చేయి సాచుచును
నాతని కొడుఁగుడు నంతలోపలను
హరుఁడోడకోడకు మనుచు నక్షణమ
ఎరదయామతిఁ దన వక్షంబుఁ దెఱప
జగదభినుతకరడెగ భోగనాథు
నగణిత దివ్యలింగాంగంబు చొరఁగ
నమ్మాత్రలో నహహా పోయెననుచుఁ
గ్రమ్మన తండ్రి కూఁకటి వట్టుటయును
వెలుపలఁ గూఁకటి వెంట్రుకల్ సిక్కె
వెలయ లింగంబులోపలఁ జిక్కె బాల
యిల నేఁడు నాఱునెలల కొక్కమాఱు
నలరి కూఁకటి వెంట్రుకలు గత్తిరింప

బాల నిశ్చల ముగ్ధభావసంపదకు
నీలోకమున దృష్టమిది యని పొగడ
గొడగూచి యని చెప్పఁబడి మహామహిమ
నడరెఁ దానాముగ్ధ (యదియునుగాక)

(బసవ. పు. తృ. ఆ. 62-63. పు)

---

# మంచన

ఈతని కేయూరబాహు చరిత్రమునుండి వనవర్ణనములోని యొక పద్యము ఇందుదాహరింపఁబడినది. ఈతఁడు 1300 సంవత్సర సమీప కాలమున గ్రంథరచనచేసియుండును.

## వనవర్ణన

చ. దలముగ నెల్ల ప్రొద్దును లతానివహంబుల రాలు పుష్పొడుల్
పులినతలంబులై చెలువుఁబూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళముల మొత్తమోడల విధంబునఁ దేలఁగఁజాఱుఁ బెద్దలై
ఫలరసవాహినుల్ పురి యుపాంతవనంబులఁ గొన్నిచోటులన్.

మంచన, కేయూ. బా. చ. ఆ. 1. పద్య. 60.



# రావిపాటి త్రిపురాంతకుఁడు

ఇతఁడు 1290 - 1330 సమీపకాలములోనుండినవాడు. ఇతఁడు వ్రాసిన త్రిపురాంతకోదాహరణము మిక్కిలి యింపయినది.

ఉదాహరణమను పేర వెలసిన తెనుఁగుకావ్యములలో నొక ప్రత్యేకత గలదు. అందు నొక్కొక్క విభక్తి కొక్కొక్క వృత్తము, కళిక, ఉత్కళిక, అను పద్యములు వ్రాయఁబడుచుండును. అట్లే ఏడు విభక్తులకును వ్రాసి తరువాత సార్వవిభక్తిక పద్యమొక్కటి వ్రాయఁబడును. ఇందు ప్రథమావిభక్తికని, సార్వవిభక్తికముగను వ్రాయఁబడినవి గలవు.

ఇందు త్రిపురాంతకదేవుని స్తోత్రమున్నది.

## త్రిపురాంతకోదాహరణము

### ప్రథమావిభక్తి

ఉ. శ్రీనగచక్రవర్తి తుది శృంగము చూచెదమంచు నేఁటికిం
బోననిశంబు నుండునిదె పుట్టువుఁ జావునులేని మందు నా
చే ననుచుం బతాకయను చేఁ దరుణాంశల మెక్కిచీఱుఁ బం
చాననుఁ డిందుమౌళి త్రిపురాంతకదేవుఁడు భక్తలోకమున్.

## కళిక - వృషభగతిరగడ - త్రిపుటతాళము

ప్రథమా విభక్తి

మఱియు సజ్జన భక్తగృహముల - మరగితిరిగెడు కామధేనువు
కఱదలెఱుఁగక వేడుదీనులఁ - గదియు జంగమరత్నసానువు
శైలజాముఖ చంద్రరోచుల - చప్పులఁ దవిలెడు నవచకోరము
వేలుపుందపసుల తలంపుల - వెల్లి గొల్పెడు నమృతపూరము
దేవతలుమువ్వురకు నవ్వలి - దెసవెలుంగుచు నుండునెక్కటి
భావవీథులఁగలసి పలుకులఁ - బట్టి చెప్పఁగరాని చక్కటి
ఆఱురేకుల మంత్రకుసుమము - నందు వెలిఁగెడి చంచరీకము
వేఱుసేయక యోగిజనములు - వెదకిపొందెడు నూర్ధ్వలోకము.

### ఉత్కళిక

అడుగుఁ దమ్ములఁ జొప్పు పసిగని
యడరి శునకాకృతులు గైకొని
మీఱి చదువులు దవిలి ముందటఁ
బాఱు క్రోడము నేసి మందట
లాడి తను మార్కొనఁగ వచ్చిన
యాటవిక కుల సార్వభౌముఁడు
జూట భాస్వత్తుహిన ధాముఁడు.

సార్వవిభక్తికము :

శా. నీవాద్యుండవు, నిన్నుఁదెల్పుఁ జదువుల్, నీచేత మేలొంద నీ
కై వాక్పూజ లొనర్తు, నీ వలన బ్రహ్మాండావళుల్ పుట్టు, నీ

కే వేల్పుల్ సరి, అన్యదైవభజనంబే నొల్ల నీయందు మ
ద్భావం బొందఁదగున్ గుమారగిరినాథా ! చంద్రచూడామణీ !

—రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము

---

# నాచన సోనాముఁడు

ఈతఁడు వ్రాసిన యుత్తరహరివంశమను గ్రంథము హరిహర నాథున కంకితముచేసెను. ఈతఁడు వసంతవిలాసమను మఱియొక ప్రబంధమునుగూడ రచించెనని చెప్పుదురు. కాని అది లభింపలేదు. ఈతఁడు ఎఱ్ఱనకు సమకాలికుఁడనియు, క్రీ. శ. 13వ శతాబ్దము తుది భాగమున నుండియుండవచ్చుననియు నూహింపఁబడుచున్నది,

నరకాసురుఁ డింద్రుని జయించి యాతని స్వర్గరాజ్యమును వశపఱచుకొనెను. ఆతనికి భోగ్యమై యనురక్తయయిన యూర్వశిని గూడ వశపఱచుకొనఁ దలఁచి యామెను రమ్మని యాజ్ఞాపించి సల్లాపించెను. ఆమె కీతని యందనురక్తిలేక తప్పించుకొనఁబ్రయత్నించును. ఆ సన్నివేశము ఇందు వర్ణింపఁబడినది.

## ఊర్వశీ నరకాసుర సంవాదము

సీ. తొడవు లూడ్చినవైనఁ దొయ్యలిరూపుతోఁ
జిన్నవోయిన పట్టు చెన్ను మీఱు
సిరులు పుచ్చినవైన వెలది పెన్నెఱితావిఁ
బాయని జవ్వాది బయలు మెఱయుఁ

బూఁతరాల్చిన నైనఁ బొలఁతుక మై చాయ
గవుసెన వుచ్చిన క్రమము దెలుపు
మడుగు మాసిన నైన మగువపిఱుందు సో
యగము చూపఱచిత్త మాఁకగొలుపు
తే. మురిపెముల నుజ్జగించిన ముగుద నడుపుఁ
గలికిచూపుల వీడ్కొన్న కన్నుఁగవయుఁ
జిఱు నగవు నోసరించిన చిగురు మోవి
నింతి మదిభీతి వెలువీడు టెఱుక సేయ.

క. దనుజేంద్రుఁడా తలోదరిఁ
గనుఁగొని చొక్లెంబు నిమురుఁ గ్రమ్మన బైకొం
గనువు పఱచుఁ గేదఁగి రే
కు నఖంబులఁజీఱుఁ గులుకు కోర్కులఁ దేలున్.

క. అత్తెఱఁ గంతయు నూర్వశి
చిత్తంబున నెఱిఁగి వాఁడు చేతోజాతా
యత్తుండై తనుఁ బిలువం
బుత్తెంచుట తెలిసి లోనఁ బూనిన లజ్జన్.

ఉ. తోరపుఁ జన్నుదోయిపయిఁ దొంగలి ఱెప్పల దాఁచి చూపు నీ
హారములేని క్రొమ్మెఱుఁగులై నిలువం గొలువల్లఁ జొచ్చి యే
చ్చేరువ కంబముంగదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపుబొమ్మవోలె నచటం గదలించుక లేక యుండఁగన్.

ఉ. ఆ లలితాంగిఁజూచి నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం
డాలములో ననుంగదిసి యంతక పాశి కుబేరయుక్తుఁడై

తోలుపులంబడెన్ సతులు తోడనె డాఁగిరి దైత్యభీతలై
పోలఁ దొలంగి తేమిటికిఁ బొత్తుల దానవు నీవు తొయ్యలీ.

ఉ. నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తా కరతాలవృంత సముదాయ సమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైన నా సభన్
నీ కనుదోయివెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే,

మ. అవె సుత్రామ రథంబు లల్లవె కుబేరానేకప్రశ్రేణుల
ల్లవె వార్ధీంద్రుతురంగమంబు లవె ప్రేతాధీశ వీరావళుల్
దవులంబాఱినఁ బట్టితెచ్చి రనిలో దైతేయు లీ సొమ్ము లిం
పువిదా నీకుఁబ్రియంబుగైకొనుము నీయుల్లంబు దెల్లంబుగన్.

ఉ. కౌగిఁటికానచేసి నొడికారితనంబున నిన్నుఁదేల్చి రా
రాఁ గొఱగానివాఁడనయి రామలలో నగుఁబాటుదేను నీ
కేఁగలుగంగ సంపదలకేల విచారము పద్మగంధి, నీ
లోఁగిటఁ జేర్పనే యుభయలోకసుఖంబులు నన్నుబొందినన్.

వ. అనుటయు నక్కాంత చింతాక్రాంతయై యొక్కింత దెలిసి యత
నితో నిట్లనియె.

చ. చతురవచోవిలాసగుణసాగర, సాగరమేఖలావనీ
పతియగు నీకు నింతులొక బ్రాఁతియె నీవిటు గోరుటెల్ల నా
యతులితభాగ్యమింత నిజమైనఁగలంగక మున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాఁడయినన్ నను గారవించితే

ఉ. నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్
నీవిటు దూఱనేర్తునని నేరమివెట్టితిగాక యేను మీ

దేవతలున్న వీటి కరుదెంతునె మిండటికంబు చేఁతకై
లావునరాక వేఱొకతలంపున వచ్చినఁ గీడు పుట్టదే.

ఉ. అనుటయుఁ బూర్ణచంద్రముఖి యద్దనుజేంద్రునితోడ నిట్లనున్
మనమున నింతమాత్రమనుమానముగల్గిన నిందు నన్ను ర
మ్మనుట పొసంగ దొక్క దినమైనను నీ విహరించుచోటికిన్
ననుఁ బిలిపింపవైతి తగునా చనవింతకు నాకుఁ జెల్లదే.

వ. అనుటయు నతండు.

క. పగవాఁడఁట దేవేంద్రుఁడు
మగువా, నీవతనికొలువు మానిసివఁట నిన్
దగవు చెడి పిలువఁబనుచుట
మగతనమే యిట్టి లంజె మాటలు గలవే.

వ. అనుటయు నచ్చెలువ విచారించి

ఉ. లంజియనౌదునేను విను లావున నీవమరేంద్రు గెల్చి న
న్నుంజెఱపట్టి తెమ్మని వినోదముచేసితిగాక చిత్తమె
ల్లంజెడియుండ రిత్త యొడలం జవిచేరునె చిల్కవోయినం
బంజరమేమిసేయ రసభంగము సంగతిలోన మెత్తురే.

వ, అనుటయు.

క. అంజెదవు గాక నను జెం
తం జేరఁగనీక యెంత తఱిఁగిన మిరియా
లుం జొన్నల సరిపోవే
లంజెతనములందుఁ గొమిరెలన్ గెలువ వఁచే.

గీ. అనుడు నవ్వామలోచన యతనిఁ జూచి
చిఱుత నగవుల తెప్పల సిగ్గుతేర్చి
నీవు రాజవు మాటలు నిన్ను గడప
నాడ నేర్తునె విన్నప మవధరింపు.

నాచన సోమన, ఉ. హ, ప్ర, ఆ. 56-76.

---



10

# చిమ్మపూడి అమరేశ్వరుఁడు

ఇతఁడు 1350 ప్రాంతముననుండి నట్లూహింపఁబడినవాఁడు. ఈతనికృతి విక్రమసేనము లభింపలేదు. ఇతని కవితను పూర్వకవులు కొంతమంది శ్లాఘించిరి. ఈతని విక్రమసేన మందలిదనిప్రబంధసారశిరోమణిలో నుదాహరింపఁబడిన పద్యము ఇచట నీయఁబడినది. ఇందు జలక్రీడ వర్ణింపఁబడినది.

## జలక్రీడ

సీ. కలయంగ నలఁదిన కస్తూరి పెల్లుగ
జలమున కెల్లను గలుగఁ జేసి
కుచమండలంబుల కుంకుమ చర్చల
నీరెల్ల జేవురునీరుచేసి
తనులిప్త సురభి చందన కర్దమంబున
వారినెల్లఁ బునుఁగు పండుచేసి
మూలల నవపుష్ప మాలికా వితతుల
వనమెల్లఁదెట్టువ కొనఁగఁజేసి
ఆ. అలకలవికవీధి నంటఁ గస్తవలఁ గెం
పెలయఁ గామచిహ్నలెల్లఁ జెలయ
నెలరు నాతులమర జలకేళి చాలించి
కొలను వెడలిరింతు లలస గతుల.

—చిమ్మపూ, అ. విక్రమసేనము.

# జక్కన

ఈతఁడు విక్రమార్కచరిత్ర మనుపేర వెలయు నొక కావ్యమును రచించెను. రసవంతమయిన రచనము చేయఁగలవాఁడు. ఈతని కాలము 1350-1400.

పై గ్రంథములోని పురవర్ణనమును వెన్నెలవర్ణనమును చేయు నొక్కొక్క పద్యమిందుదాహరింపఁ బడినది.

## పురవర్ణన

సీ. శ్రీ కవితానూన చిత్రరేఖాయుక్తి
కొమ్మలందును గోటకొమ్మలందు
నవరస ఫదయుక్తి నానార్థగరిమలు
రాజులందును గవిరాజులందుఁ
గని లోకసంతోషకర జీవనస్థితి
సరసులందును గేళిసరసులందు
నవవన శ్రీ సుమనః ప్రవాళవిభూతి
మావులందును నెలమావులందుఁ

గీ. గలిగి సముదగ్ర సౌధాగ్రతలసమగ్ర
శాతకుంభమహాకుంభ జాతకుంభి
తోరురత్న వినూత్న శృంగారమగుచు
సిరుల నొప్పారు విక్రమసింహపురము.

—విక్రమా. చ. ఆ. 7. 133. ప.

# వెన్నెల

సీ. గంగాప్రవాహంబు గాఁబోలునని వశి
ష్ఠాదులనుష్ఠాన మాచరింప
నమృతంబువెల్లువయని నిలింపాదులు
మునుకొని దోసిళ్ల ముంచి క్రోల
దుగ్ధాంబునిధియని తోయజాక్షుండు శేష
పర్యంకమిడుకొని పవ్వళింపఁ
బరమేశు విశ్వరూపంబని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ

గీ. దలఁప భూనభోంతరముల కొలఁది తెలిసి
బెరసి యెన్మిదిదిక్కులఁ బొరలి పొరలి
దట్టముగ నంతకంతకుఁ దనరి తనరి
యిట్టలంబుగ వెన్నెల నిట్ట వొడిచె.

జక్కన. విక్రమా. చ. ఆ. 6. ప. 69

# శ్రీనాథుఁడు

శ్రీనాథుఁడు ఆంధ్రవాఙ్మయమున ప్రత్యేకస్థానము గాంచినవ్యక్తి. గొప్పపండితుఁడు. అనేకవాదములలో గెలిచినవాఁడు. సామాన్యుల కందని యనేక కఠినగ్రంథములలోని మార్గములను సంస్కృతమునుండి తెనుఁగునకుఁ దెచ్చినవాఁడు. స్వతంత్రుఁడు గావున తన ప్రతిభచేతఁ గ్రొత్తఁదనముగూడ నెఱపఁగల్గెను. వేఱువేఱుమార్గములలో నున్న శృంగారనైషధము, హరవిలాసము, భీమేశ్వరపురాణము, పలనాటి వీరచరితము మొదలయిన గ్రంథములను ఈతఁడు వ్రాసెను. ఈతని రచన అడ్డులేని యొక మహాప్రవాహమువలె నుండును. ఈతని జీవితము నందలి వివిధఘట్టములలో కవిత్వము తనంత నుబికి వాస్తవత కొంక యతిలోకతను గూర్చుచుండును.

ఈతని జీవితకాలము సుమారు 1370 - 1445. హరవిలాసము అనెడి కావ్యము శివుని చర్యలను వర్ణించుగ్రంథము. 'దారుకావనము' అను పేరుగల మునుల నివాసమును గూర్చి యిందు వర్ణింపఁ బడినది.

## దారుకావనము

సీ. కర్ణికా మాణిక్య కనక పద్మములతోఁ
గల్పవల్లీ కుడుంగములతోడ
విమల చింతారత్న వేదికాస్థలులతో
సిద్ధరసాపగా శ్రేణి తోడ

దివ్యలోకాప్సరః శ్రీ కదంబములతోఁ
గామదుగ్ధేను సంఘముల తోడ
దివ్యౌషదీలతా దీపమాలికలతో
సకలర్తు సన్నివేశంబు తోడ

తే. మదన వైరికి గారాపు మామయైన
మంచు గుబ్బలి తేని సీమాంచలమున
దేవతా ముని సేవ్యమై తేజరిల్లు
ధర్మ సంజీవనము దేవదారు వసము.

క. అందు వసియించు సంయమి
సందోహము పంచబాణసదృశము లీలా
సౌందర్యకళా నిర్జిత
బృందారక నతులు వారి బింబాధరలున్.

సీ. జిలుఁగైన కనకంపుఁ జీనాంబరము కొంగు
పాలిండ్ల బింకంబు బయలు పఱుప
భ్రమరకంబులఁ జుట్టు ప్రస్వేద కణములు
నొసలి కస్తురి బొట్టు నూలుకొలుప
దరవిశ్లథంబైన ధమ్మిల్ల భారంబు
చిమ్మచీఁకటులకుఁ జిట్ట మిడువఁ
దరళ హాటకరత్న తాటంకదీప్తులు
చెక్కుటద్దములపై జీరువాఱఁ

తే. బసిఁడి కుండల నిర్ఝరాంభస్సు దెచ్చి
పోయుఁ గంకణ నిక్వాణములు సెలంగఁ

గన్యలతలకు మునికన్యకాకదంబ
మభిమతంబైన యప్పావనాశ్రమమున.

క. జ్యోతిష్టోమాది ముఖ
త్రేతా నిలపుణ్య ధూమ రేఖావృత గం
ధాతిశయం బడఁ గించుం
బాతక సంఘము తదీయ పర్యంతములన్.

ఉ. సమ్మద లీలతోఁ జదువు సామము పేడును గండుఁగోయిలల్
తుమ్మెద లాలపించుఁ బరితోషమునం బ్రణవాక్షరంబులన్
సమ్మతిఁ బ్రస్తవించు శుకశారిక లాగమ భాషితంబులన్
నెమ్మదిఁజెప్పు శాస్త్రముల నీలగళంబులు తద్వనంబునన్.

శా కాముంబేరికిఁ గోక క్రోధము నహంకారంబు లోభంబు నీ
ర్ష్యా మాత్సర్య మదావలేప కుహనా రాగంబులం జేర నీ
కాముష్యాయణులై ప్రశాంతమతులై యయ్యాశ్రమాంతంబులన్
నేమంబొప్పఁగ సంచరింతురు మునుల్ నీవారముష్టింపచుల్.

శా. ఆనందబునఁ ద్రుళ్లి పుచ్ఛములు పెల్లల్లార్చుచున్ వేఁగల
క్కానన్ గోకులగోష్ఠదేశములజంఘాలాఘవంబొప్ప హో
మానుష్ఠానవిధి ప్రకార పరతంత్రాత్మప్రసూకామ ధు
గ్ధేనూధస్వ సుధా ప్రవాహలహరీ తృప్తాంతరంగబులై.

శా. ఆయా వేళల మౌనిధార్యలు గృహవ్యాపారలీలా భవ
త్కాయక్లేశము లుజ్జగింతురు లసత్కర్పూరరంభాతరు
చ్ఛాయా శీతల చంద్రకాంత మణి పాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురము పైవర్షింప నక్కానలోన్.

వ. మఱియు నత్తపోవనంబు నందు.

క. నిలయ వ్యాపారంబుల
యలపుల మేనులు చెమర్చి యపరాహ్ణమునన్
సెలయేఱులలోఁ జల్లులఁ
జలుకులు నాడుదురు మునులచివురుంబోఁడుల్.

సీ. సెలయేటి తెలినీటఁ జిఱుబంతి పసుపాడి
సేసక్రుమ్మొళ్ళఁ బిచ్చియలు తుఱిమి
గురువింద పేరులు గుబ్బచన్నులఁ దాల్చి
నెమిలిపించెంపుఁ బుట్టములు గట్టి
పయ్యెద మాఱుగాఁ బాఱుటాకు లమర్చి
చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళి చిగురాకుఁ గర్ణపూరముఁ జేసి
కుసుమ పూవుల ధూళి కురులఁజల్లి

తే. చెంచు చిగురాకుఁబోఁణుల చేత లెల్ల
నభినయింతురు పర్ణశాలాంతరములఁ
దంద్రులేందేనిఁ జనునప్డు తల్లు లెదుర
గారవమ్మొన మునికన్యకాజనంబు.

సీ. నిర్ఝరాంభఃకేళి నీలకంఠాంగనా
తాండవాడంబ రా దర్శనంబు
పుష్పాపచాయంబు పూర్ణిమాతిథి నిశా
చంద్రోదయారంభ సంభ్రమంబు

ప్రసవ కందుక లీల బాల ప్రవాళేచ్ఛ
గిరి నదీసైకత క్రీడనంబు
పాంచాలికాకర కాంచన కుంభాంబు
పూర కల్పిత లతా పోషణంబు

తే. లతిథి పూజార్థ సజ్జీకృతార్ఘ్యపాద్య
సలిల మధుపర్కలాజ కుశప్రవాళ
గంధ పుష్పాక్షతాది ప్రకల్పనములు
ప్రత్యహఃకృత్యములు మౌని బాలికలకు.

—శ్రీ నా. హర. వి, ౫. ఆ. 28 - 39.

---


11

# వల్లభ రాయలు

తెనుఁగులో సాధారణములయిన ప్రబంధములును పురాణములును గాక అరుదయిన 'వీథి' యను పేరఁ బరఁగు నొక రూపకవిశేషము 'క్రీడాభిరామము' ప్రచారములోనున్నది. ఇందలి విషయము శృంగార హాస్యరసములు ప్రచురముగా వాక్యోపవాక్యములుగా పద్యరూపమున నుండును దీనిని వినుకొండ వల్లభరాయలు అనునతఁడు ప్రేమాభిరామము అను మఱియొకగ్రంథము ననుసరించి వ్రాసినట్లు గలదు ఈ గ్రంథము సుమారు 1420 లో రచింపఁబడి యుండునని యూహ.

ఇది శ్రీనాథునిచే రచింపఁబడిన దనియు, వల్లభరాయల పేరఁ బ్రచారములోనికి వచ్చినదనియు నొక వాదముగలదు. కొన్నియెడల గ్రంథమున శృంగారము హద్దుమీఱి రచించినట్లుండును గాని, నాఁటి దేశీయ సాంఘికజీవనమును ప్రతిబింబించుటలో నీ గ్రంథము అద్వితీయము.

ఇందలి పల్నాటివీరుల కథనుగూర్చినగానము ఆనాఁడు జరుపుచుండినరీతి యిందు వర్ణింపఁ బడినది. పలనాడు మండలము గుంటూరు జిల్లాలోనిది. అచ్చట వీరులు యుద్ధముచేసి మడిసిన ప్రాచీన వీరగాథ ఆంధ్రదేశమున ప్రసిద్ధము. ఈగాథ యీ గ్రంథరచననాటికే ప్రసిద్ధమై యుండెననుట దీనినిబట్టి తెలియుచున్నది.

# పల్నాటి వీరుల కథ

మ. ద్రుతతాళంబుల వీరగుంఫితక ఘుంధుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమును వీరానీకముం బాడె నా
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.

సీ. గర్జించి యరసి జంఘాకాండ యుగళంబు
వీరు సంబెట కోలఁద్రేయు నొకఁడు
ఆవీథపాద విన్యాసమొప్పఁగ వ్రాలి
కుంతాభినయము గైకొను నొకండు
బిగువుఁ గన్నుల నుబ్బు బెదరుఁ జూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచ నొకఁడు
పటుభుజావష్టంభ పరిపాటి ఘటయిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు

ఉద్ది ప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్లఁ బఱపు నొకఁడు
కొడుము దాఁటింపుచును బెద్దగొలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు,

గీ కులము దైవతంబు గురిజాలగంగాంబ,
కలని పోతులయ్య చెలమికాఁడు
పిఱికి కండలేని యఱువది యేగురు
పల్లెనాటి వీరబాంధవులకు.

గీ. ఆరువల్లి నాయురాలి దుర్మంత్రంబు,
కోడిపోరు, చాపకూటి కుడుపు
ప్రథమకారణములు పలనాటి యేకాంగ
వీరపురుష సంప్రహారమునకు.

ఉ. పచ్చని పిండిగందమును, బాలము సేసయు, నెఱ్ఱపూవులన్
గ్రుచ్చిన కంఠమాల్యములు, గొప్పగ నల్లిన వేణి బంధముల్,
కుచ్చుల వీర సంబెటయుఁ గ్రొత్తమణుంగగు కాసె పుట్టమున్,
అచ్చలకెక్కినట్టి రవణంబులు వీరకుమార కోటికిన్.

క. నల్లంగొండయు, నాగరి
కల్లును, ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లేరు నాగులేరును,
బల్లెత్మోకాంత యెల్లప్రారంభంబుల్.

సీ. ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చనుపాయంబు
నలినాక్షి యార్వెల్లి నాయురాలు
నిజ మనుశుద్ధికై నిజమను యేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిల పణంబుగ గొల్ల
సవతి తల్లుల బిడ్డలవని పతులు
ధీరులగువారలేవురు వీరపురుషు
లై మతోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి

యనుచుఁ జెప్పుదు రైతిహ్యామచట నచటఁ
జనుప పెద్దలు పల్లె దేశములయందు.

ఉ. చిత్తముగూర్చి మాచెరల చెన్నుఁచు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁజూడ ముల్కి విషయంబునకాపహిమంబుచెల్లెఁగా
కుత్తరలోన మింట జలముట్టినమాత్రన నాపఘాలలో
ఎత్తిన యావనాళ మభివృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా ?

మ. మగసింగంబులు సంగరాంగణములన్ మత్తిల్లి రున్మత్తులై
జగదేకస్తుతులంచు నేమిటికి సంశ్లాఘింప ; నాభూమిలోఁ
జిగురుంబోఁడులఁ గాపుగుబ్బెతల నక్షీణప్రభావంబునన్
మగసింగంబులఁగా నెఱుంగుదురు పుంభావప్రసంగంబులన్.

గీ. కోల దాపునఁద్రిక్కటిఁ గూడియున్న
గచ్చుపేసిన చిత్రంపు గద్దెపలక
వ్రాసినారదె చూడరా వైశ్యరాజ !
ఏల బ్రహ్మాది వీర నాసీర చరిత.

—క్రీడాభి రా. 36-40. పు

# దగ్గుఁబల్లి దుగ్గన

ఇతఁడు శ్రీనాథకవిసార్వభౌమునకు నెయ్యముసేయు మఱఁది. ఇతఁడు సుమారు 1410-1160 నడుమనుండి యుండవచ్చును.

ఈతఁడు నాచికేతూపాఖ్యానమున శాలిపాలికలు బాటసారులతో సేయు సంభాషణ శృంగార గర్భితముగా వర్ణించెను,

## శాలిపాలిక

సీ. కలికిరో నీయూరు గంటినదే కాదు
వాడెను జనుపల వనజనయన
పథికేంద్ర ! ఋతుపేఁగి పరికింప నెలదప్పె
నటుగాన వాఁడెఁ బయస్సులేక
పికవాణి ! యెదఁబండుటకుఁ గాలమెయ్యది
మాకెఱిఁగింపుము ప్రాకటముగ
నీనిన పిమ్మట నెదఁబండుటకుఁ గాల
మని యెఱుంగపె రసికాగ్రగణ్య !

గీ. అనుచుఁ బాంధజనులతోడ ననుదినంబు
హేతుగర్భోక్తులాడుచు నెదలు గరఁగ
మధురగానంబుచే యువమనముఁ గొనుచు
శాలిపాలికలుందు రాప్రోలియందు.

—దగ్గుఁబల్లి దుగ్గన - నాచికేతూపాఖ్యానము ఆ. 2.

# తాళ్లపాకము అన్నమాచార్యులు

తిరుపతిక్షేత్రము నాశ్రయించి యచ్చటి దైవతమగు శ్రీ వేంకటే శ్వరుని అనేకవిధముల స్తోత్రము చేసినవారిలో తాళ్ళపాకవంశీయులు ముఖ్యులు అందు అన్నమాచార్యులు సుప్రసిద్ధుఁడు. ఈతఁడు గాయక శిరోమణి. మహాభక్తులలో నెన్నఁదగినవాఁడు. ఈయన రచించిన కీర్తనలు చాల ప్రసిద్ధములు ఇతనికాలము 1408—1503.

తుమ్మెదపదము అనఁబడు నొక గీతవిశేషము క్రింద నీయఁబడి నది. ఇందు 'తుమ్మెద'యని బోధింపఁబడిన దైవము వేంకటనాథుఁడు.

## తుమ్మెద పదము

శ్రీరాగం—ఏకతాళి

పల్లవి

తొల్లిటివలెఁ గావు తుమ్మెదా యింక
నొల్లవుగా మమ్మునో తుమ్మెదా.

చరణములు

తోరంపు రచనల తుమ్మెదా కడుఁ
దూరేవు గొందులే తుమ్మెదా

దూరిన నెఱుఁగవు తుమ్మెదా మమ్ము
నోరగఁ జూడకువో తుమ్మెదా.

తొలుప్రాయపు మింద తుమ్మెదా కడుఁ
దొలిచేవు చేఁగలే తుమ్మెదా
తొలుకరి మెఱుఁగపే తుమ్మెదా యింక
నులికేవు మముఁగని తుమ్మెదా.

దొరవు వేంకటగిరి తుమ్మెదా మా
తురుమేల చెనకేవు తుమ్మెదా
దొరకె నీ చనవులు తుమ్మెదా యింక
నొరు లెఱింగిరి గదవో వోతుమ్మెదా.

—తా. అన్నమాచార్య-శృంగార సంకీర్తనములు. 4 వా. 9 వపదము.

# వేమన

తెలుఁగు తీయఁదనముట్టిపడునట్లు గొప్పసూక్తులను ఎల్లరకును దెలియురీతిని కూర్చిన మహాకవి వేమన. ఈతని పద్యములు ఎల్లెడలను తెనుఁగునాట ఆబాలగోపాలమును పఠింతురు.

ఈతనికాలము 1400-1480 అని యొకరీతిని నిర్ణయింపఁబడెనది. ఈతఁడు మహాయోగి.

## వేమన నీతి

ఆలు మగనిమాట కడ్డమాడిన దేని
యాలుగాదు దనుజురాలుగాని
అట్టి యాలు విడిచి యడవికేఁగుట మేలు
విశ్వదాభిరామ ! వినుర వేమ !

౨

అల్పుడెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కుఁ జల్లఁగాను
కంచుమ్రోఁగినట్లు కనకంబు మ్రోగునా !
విశ్వదాభిరామ ! వినుర వేమ !

౩

గొడ్డుటావుఁ బిదుకఁ గుండ గొంపోయినఁ
బండ్ల నూడఁదన్ను పాలనీదు

లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభిరామ ! వినుర వేమ !

౪

మేడిపండుచూడ మేలిమై యుండును
పొట్ట విచ్చిచూడఁ బురుగులుండుఁ
బురుషులందుఁ బుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ ! వినుర వేమ !

# పిల్లలమఱ్ఱి పినవీరన

ఈతని కృతులలో శృంగారశాకుంతలమను ప్రబంధము సుప్రసిద్ధము. అందలి కథ శకుంతలాదుష్యంతుల చరితము. దాని యందలి వసంతకాల వర్ణనము క్రింద చేయఁబడినది.

ఇతఁడు 1450-1500 సంవత్సరముల నడుమ నుండినవాఁడు.

## ఆమని

సీ. తళతళమించు కెందలిరుటాకుల నెడ
నెడ నొయ్యనొయ్యనఁ దొడిమలెత్తెఁ
దొడిమల నడుమ వాతలొకింత గనవచ్చె
రానన ననలంకురంబునొందె
ననలంకురంబంది నవకంబుతోఁగూడ
బలసి లేఁ దావుల కలికలయ్యెఁ
గలికల పరిమళంబులు వాకొలుపుమోము
లరవిచ్చి మవ్వంపు టరటులయ్యె

తే. నలరుగుత్తులు మకరంద మలక నెఱయ
విచ్చి సోడు ముట్టింపఁగా వీధికలను
దరుణభావంబునొందించెఁ దరులలతల
నభినవంబైన నవవసంతాగమంబు.

మ. సంపెంగల్పొరువంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొం
దింపం బాదపముల్ ఘనంబులయి పూఁదేనెల్ దువాళించి వ
ర్షింపన్ వల్లిరి చల్లి పాంథజనరాజిన్గమ్మగాడ్పుల్ చలిం
పింప న్మాధవుఁడంబుదాగతి విడంబించెన్ విజృంభించుచున్.

శా. హేమంతంబను రాజు సేనపఱపన్ హేలాగతిన్ జైత్రుఁడన్
సామంతుండెదురం దదీయజవరాజత్కార తుషార రిం
ఖామార్గంబుల నించుపాంసువులు నాఁగాఁబర్వె నారామగుం
జామల్లీలవలీలవంగ నవపుష్పశ్రేణికా రేణువుల్.

ఉ. తెమ్మెరలూఁపఁగా నలరుఁదేనియలాని మదించి యింపునన్
దుమ్మెదలేమలాగతులతో మధురస్ఫుటకోకిలానినా
దమ్మునఁ బాడుచుండెను లతానవడోలల నూఁగి యాడుచుం
గమ్మని వింటిజోదు జయగాథలు పుష్పితభూజవీధులన్.

—పిల్లలమఱ్ఱి. శృ. శా. ఆ. 2. ప 126-130

---

# బమ్మెర పోతన

కృతిపత్వము భగవంతునకుఁ గానుకగా నీయవలెనని భాగవతమును దెనిఁగించిన మహాకవి పోతన. భక్తిప్రధానమైన రచనలను వ్రాయుటలో ఈతని శక్తి నిరుపమానము.

ఈతఁడు సుమారు 1450 సంవత్సరములో జన్మించి 1490 లో భాగవతమును తెనిఁగించెనని యూహింపఁబడినది. ఈతఁడు వ్రాసిన భాగవతములోని భాగములు శిథిలముకాఁగా, మఱికొందఱు భాగములను బూరించిరి.

బలిచక్రవర్తి వామనునకు దానమిత్తునని సంకల్పించినపుడు వారిరువురకును గలిగిన సంవాదము ఇందు వర్ణింపఁబడినది.

## బలివామన సంవాదము

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలంబెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
గడుధన్యాత్ముఁడనైతి నీముఖముయోగ్యంబయ్యె నాకోరికల్
గడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుంగల్యాణ మిక్కాలమున్.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులో విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీ సురేంద్రోత్తమా.

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుండిట్లనియె.

సీ. ఇదినాకునెలవని యేరీతిఁబలుకుదు
నొకచోటనక యెందునుండనేర్తు
నెవ్వనివాఁడనంచేమని పలుకుదు
నాయంతవాడనై నడవనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు

ఆ. నొరులుగారు నాకు నొరులకునేనొదు
నొంటివాఁడఁ జుట్టు మొకఁడులేఁడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెద నాచెంకి
సుజనులందుఁ దలఁచు నొచ్చియుందు.

వ. అది యట్లుండనిమ్ము.

సీ. జననాథ, నీమాట సత్యంబు సత్కీర్తి
దంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనతత్త్వమూర్తులు
గాని మీకులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణ భీరువులు లేరు
ప్రత్యర్థులర్థులు ప్రచ్చికొనిన
దానశౌండిమమునఁ దనుపుదురధికులై
మీతాతలందఱు మేటిమగలు

ఆ. మీకులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటిచంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశి భంగి నెగడుచుండు.

వ. అదియునుం గాక

క. మున్నెన్నఁడు దురు వదాన్యుల
నెన్నడుచో నిన్నుఁ ద్రిభువనేశుండనుచున్
ఇన్నిదినంబుల నుండియు
నెన్నఁడు నిను బెట్టుమనుచు నింద్రము సేయన్.

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద
దానకుతుక సాంద్ర, దానవేంద్ర!

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె.

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధసమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచెమడిగితి వో చెల్ల
దాత పెంపుసొంపు దలఁపవలదె.

వ. అని మఱియు నిట్లనియె.

మ. వసుధాఖండము వేడితో గజములన్వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో

పసిబాలుండవు నేరవీవడుగ నీ భాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయంబడుగ నీయల్పంబు నీ నేర్చునే ।

వ. అనిన మొగంబునఁ జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె.

మ. గొడుగో జన్నిదమో కమండలువో నాకున్ ముంజియోదండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మమెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్.

వ. అదియునుంగాక.

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నయినఁ జిక్కంబడునే.

శా. ఆశాపాశము దాఁగడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర, వా
రాశిప్రావృతమేదినీవలయ సామ్రాజ్యంబు సేకూపెయుం
గాసిం బొందిరి గాక పైన్యగయ భూకాంతాదులున్నర్థ కా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే.

సీ. సంతుష్టుఁడీ మూఁడు జగములఁ బూజ్యుండు
సంతోషికెప్పుడు జరుగు సుఖము
సంతోషి గాకుంట సంసారహేతువు
సంతసంబున ముక్తిసతియు దొరకుఁ

బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు దోస పెరుఁగుఁ
బరితోషహీనతఁ బ్రభ సెడిపోవును
జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజువనుచు నిఖిలంబు నడుగుట
దగవు గాదునాకుఁ దగిన కొలఁది
యేనువేఁడికొనిన యీ పదత్రయమును
జాలదనకయిమ్ము చాలుఁజాలు.

---

# తాళ్ళపాకముపెద తిరుమలాచార్యులు

తిరుమల, తిరుపతి దేవస్థానమునందలి శ్రీ వేంకటేశ్వరుని పర దైవతముగా నారాధించిన తాళ్ళపాకము వారిలో పెదతిరుమలాచార్యులు 1460 - 1547 సంవత్సరముల నడుమ నుండినవాడు. ఆతడు కవిత యందనేకములయిన మార్గములను ద్రొక్కినవాడు.

ఆతడు రచించిన శ్రీ వేంకటేశ విన్నపము ఇందుగలదు.

## వేంకటేశవిన్నపము

సర్వేశ్వర ! అవధారు ! ఈ జగంబు మీ నాటకశాల. నే నెత్తిన తొలుజన్మంబుల యాకారంబులు నీముందట నాడెడి బహురూపంబులు.

దార సుత బంధులు మేళగాండ్రు
నిన్ను నుతియించు వేదశాస్త్ర పురాణములు తూర్యత్రయము.
మా పాదప్రచారంబు నాట్యంబు
చేయుచేతలు నాడెడి మాటలు క్రియాభాషాంగంబులు.
మా భోగవస్తువులు నీవు మెచ్చిన యీవులు.
ఈరీతి నెంతకాలంబు నీకు వేడుక యంతకాలంబు నాడెదము,
కొలువు నర్తకుల మైనవారము.
నీకు వినోదంబుసేసుకొని బ్రదుకవలయుఁగాని నెమ్మది మోక్షంబున నుండెదమనుట యేసంగతి.
నీవై దయదలంచి కృపచేసినప్పు డయ్యెడిఁగాక.
ఎఱుకగల యేలికఁ గొలిచిన వారికి నడుగ నేమిపని !
నీవు నన్ను నన్నిటా మన్నించితివి
శ్రీ వేంకటేశ్వరా !

తాళ్ళపాక పెద తిరుమలాచార్య - వైరాగ్యవచన మాలికా గీతాలు

# శ్రీ కృష్ణదేవరాయలు

ఇతఁడు క్రీ. శ. 1509-1530 సంవత్సరముల నడుమ హంపీ విజయనగరము రాజధానిగా ఆంధ్రకర్ణాట సామ్రాజ్యము నేలిన సార్వభౌముఁడు. ఇతని కాలము ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో స్వర్ణయుగము. అనేక మహాకవులను ఇతఁడు పోషించెను. ఇతఁడనేక గ్రంథములు రచించెను. వానిలో నిప్పుడు దొరకునది ఆముక్తమాల్యద యను గోదాదేవిచరిత్ర. ఇది ప్రౌఢప్రబంధము. ఇందలి విల్లిపుత్తూరువర్ణన పద్యము లిచట నీయఁబడినవి.

## శ్రీ విల్లిపుత్తూరు వర్ణన

మ. లలితోద్యానపరంపరాపికశుకాలాప ప్రతిధ్వానముల్
వలభీనీలహరిన్మణీపికశుకస్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణసౌధముల నెందుంజూడఁ జెన్నొందు శ్రీ
విలుపుత్తూరు సెలంగుఁ బాండ్యనగరోర్వీరత్న సీమంతమై.

క. కోరకిత నారికేళ
క్ష్మారుహములు రత్నకుట్టిమంబులఁ దోఁచున్
ద్వారము లయత్నకృత శృం
గారంబుగ నలికి ముగ్గు ఘటియించి రనన్.

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ జన్దోయి లేఁగౌనుపై
దయఁదప్పన్ బసపాడి పాగడపుఁ బాదంబొప్పఁ జెంగల్వడి

గ్గియ నీ రచ్యుత మజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపుల్బోద్రోవలన్.

చ. ద్రవిడ కుటుంబినుల్ పసపుటాచిన రత్నపుఁదాఁప క్రింద నం
బువు దెరవారఁగా నిదురవోయి గఱుత్తతి పచ్చఁ బాఱినన్.
భవన సరోమరాళములు భర్మమయచ్ఛద గుచ్ఛవిస్ఫుర
ద్దివిజధునీమరాళవితతి భ్రమఁ బూన్పఁ బురిన్ భ్రమించుచున్.

మ. తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకులుషస్స్నాతప్రయాతద్విజా
వలిపిండీకృతశాటులన్నవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱు వానిఁ గని నవ్వున్ శాలిగోపౌఘముల్.

సీ. ఎదురేఁగి సాష్టాంగ మెఱఁగి పాద్యం బిచ్చి
నారికేళ కటాసనముల నునిచి
నునుఁ బోఁకపొత్తిఁ గుట్టిన దొప్పగమి తోడ
రంభా విశాలపర్ణములు వఱచి
శాల్యన్న సూపాజ్య కుల్యాబహువ్యంజ
నక్షీర దధులర్పణంబుచేసి
వార్చినపిదప సంవాహన మంఘ్రుల
కొనరిచి తాంబూలమొసఁగి కుశల

తే. మడిగి పోయెద మన్న దవ్వనిచి సిరికిఁ
దగిన సత్కృతిఁజేసి ఖేదమున మగిడి
యర్చఁగావింతు రెపుడు నిట్లతిథులైన
భాగవతులకు నప్పురి భాగవతులు.

ఆము. మా. 1 వ. ఆ.

# అల్లసాని పెద్దన

ఆంధ్ర కవితా పితామహుఁడని పేరందిన అల్లసాని పెద్దన, శ్రీ కృష్ణదేవరాయ సార్వభౌమునిచే గౌరవమునంది మహారాజభోగముల ననుభవించిన మహాకవి. ఈయన వ్రాసిన ప్రబంధము మనుచరిత్రము. ఇది శ్రీకృష్ణరాయలకు కృతిచేయఁబడినది. ఇతఁడు సుమారు 1460-1530 సంవత్సరముల నడుమ జీవించి యుండెనని యూహింపఁబడినది.

మనుచరిత్రమునందలి రసవంతమైన ఘట్టము వరూథినీ ప్రవరుల సంభాషణము. వరూథిని దేవవనిత. హిమవత్పర్వతమున నున్నది. ప్రవరుఁడు శ్రోత్రియబ్రాహ్మణుఁడు. ఈతని నామె కామించినది. కాని యాతని మనస్సు కామాయత్తముకాదు. ఈ విషయమే దిగువపద్యములలో వర్ణింపబడినది.

## వరూథినీప్రవరసంభాషణము

ఉ. ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ, యొంటిఁజరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరువెద్ది శుభంబు నీకగున్.

క. అని తనకథ నెఱిఁగించినఁ
దన కనుఁగవ మెఱుఁగులుబ్బఁ దాటంకములన్
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరిఁ వేఁడెదు భూసురేంద్ర, యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులేకడుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్.

వ. అని నర్మగర్భంబుగాఁబలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసురున కిట్లనియె.

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్ట జంత్రగాత్రముల తాల్గఁ గరఁగించు
విమలగాంధర్వంబు విద్యమాకు
ననవిల్తుశాస్త్రంపు మినుకులావర్తించు
పని వెన్నతోఁ బెట్టినవి మాకు
హయమేధ రాజసూయములనఁ బేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ

తే. గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర.

క. పేరు వరూథిని విప్రకు
మార ! ఘృతాచీ తిలోత్తమా హరిణీ హే
మా రంభా శశిరేఖ లు
దారసుధాఖ్యలు మదీయలగు ప్రాణసఖుల్,

మ. బహురత్నద్యుతి మేదురోదరదరీభాగంబులన్ బొల్చు ని
మ్మహికారణ్యమునన్ జరింతు మెపుడున్ శ్రీమన్నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్.

క. భూసుర కైతవకుసుమశ
రాసన! మాయింటి విందవైతివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేదదేఱి యాతిథ్యంబున్.

తే. కుందనపువంటి మేను మధ్యందినాంత
ఘోష్మహతిఁ గందె వడదాఁకె నొప్పులొలుకు
పదన మస్మద్ గృహంబు పావనముసేసి
బడలికలు వాసి చనుమన్న బ్రాహ్మణుండు.

ఉ. అండజయాన, యూవొసఁగునట్టి సపర్యలు మాకు నిచ్చె నిం
దుండఁగరాదు పోవలయు నూరికి నింటికి నిప్పుడేను రా
కుండ నొకంతువచ్చి మఱియొంటినె భక్తియచాలు సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ సనఁగావలయున్ గరుణింపునాయిన్.

ఉ. ఏనిక నిల్లుచేరుటకు నెద్ది యుపాయము మీమహత్త్వముల్
మానిని, దివ్యముల్, మదిఁదలంచిన నెందును మీకసాధ్యముల్
గానముగానఁ దల్లి ప్రజలన్నను జేర్పుమటన్న లేఁత న
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వానికిట్లనున్.

ఉ. ఎక్కడియూరు కాల్నిలుప కింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
పక్కట మీకుటీర నిలయంబులకున్ సరిరాకపోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి నందనచందనోత్కరం
బిక్కడి గాంగ సైకతము లిక్కడి యాలవలీనికుంజముల్

ఉ. నిక్కము దాపఁనేల ధరణీసురనందన, యింక నీపయిన్
జిక్కెఘనంబు నాకు నసుఁ జిత్తజుబారికి నప్పగింతువో
చొక్కి మరంద మద్యములచూరలఁ బాటలవాడు తేంట్లసొం
పెక్కినయట్టిపూవుఁ బొదరిండ్లను గౌఁగిటగారవించెదో.

క. అనుటయుఁ బ్రవరుండిట్లను
వనజేక్షణ, యిట్లు వలుక వరుసయె వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కామింప మది విచారము వలదే.

ఉ. వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడువృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్నినేఁ
దూలుసమస్తధర్మములు తొయ్యలి, నేఁడిలుసేరకుండినన్.

పెద్దన. మనుచ. ద్వి. ఆ. 39-53.

# నంది తిమ్మన

ఈతఁడు వ్రాసిన పారిజాతాపహరణమును శ్రీకృష్ణదేవరాయల కంకితము చేసెను. కృష్ణరాయలకు సమకాలికుఁడగుటచే నీతఁడు 1500 - 1530 లో గ్రంథరచనము చేసియుండును.

పారిజాతాపహరణమున శ్రీకృష్ణుఁడు సత్యభామను సంతుష్టిపఱచుటకు స్వర్గలోకములోనున్న పారిజాతవృక్షమును భూమికిఁ దెచ్చు వృత్తాంతము వర్ణింపఁబడినది. శ్రీకృష్ణుని భార్యయగు సత్యభామ సవతియగు రుక్మిణిపైఁ గల మచ్చరమున నాతనిపై నలుగుట యను ఘట్ట మిందు వర్ణింపఁబడినది,

## సత్యాగ్రహము

చ. అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీలయనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు దనచెక్కులఁ గుంకుమ పత్త్రిభంగ సం
జనిత నవీనకాంతి వెదచల్లఁగ గద్గద భిన్నకంఠియై.

శా. ఏమేమీ కలహాశనుండచటికై యేతెంచి యిట్లాడెనా
యామాటల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డే. మే మాడెను రుక్మిణీసతియు నీవింకేటికిన్ దాఁచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ నిక్కంబె ఱింగింపవే.

చ. అతుల మహానుభావమని యవ్విరిఁ దానొక పెద్దచేసి య
చ్యుతునకు నిచ్చకంబొదవ నూడిదయిచ్చిన నిచ్చెఁగాక రా

నతఁడు ప్రియంబుగల్గునెడ కర్పణచేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేలయచ్చటన్.

క. పలుదెఱఁగు ముళ్లమాటలఁ
గలహామె కల్యాణమని జగంబులవెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
పలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్.

క. ముని యేమిసేయు రుక్మిణిఁ
గౌనఁ గారణమేమి ధూర్త గోపాలుఁడు సే
సిన చెయిదమేమి చెప్పుదు
మనమెరియదె ప్రాణమైన మగఁడిట్లయినన్.

క. పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగదంద్రు మదిన్
శరదంబుచ చలచిత్తులు
పురుషులెపో వారినమ్మఁబోలునె చెలియా.

ఉ. ఇన్నిదినంబులున్ సవతులిందఱలోఁ గడుంగారవంబునం
గన్నియ నన్నువల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగనుండి యా
వన్నెయు వాసియుం దఱిఁగి వారు నసుం దలయెత్తిచూడఁగా
నన్నులఁ జాయలం బలుక నైఁతునె ప్రాణము లెంతతీపొకో.

ఉ. నా మొగమోటకై వలని నాటకముల్ గపియించి రుక్మిణీ
కామిని మీఁ దటంగలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁగాననీక యిట నిన్నిదినంబుల నన్నుఁదేల్చె నో
తామరసాక్షి, మెచ్చపలదా సురదానవభేది కృత్యముల్.

ఉ. ఓచెలి, శౌరికిచ్చెసఁట యొక్కలతాంతముఁ మెచ్చి నారదుం
డాచపలాక్షికిచ్చెనఁట యాతఁడు నవ్విరి యట్టిమాట లా
హా చెవులన్ వినంబడియుఁ బ్రాణముఁ దాల్చెద మేన నింతగా
నోచితి నింకనెట్టివి కనుంగొన నెమ్మె యి నున్నదాననో.

క. పూనుకొని మేలుగిళ్ళకు
లోనయి విహరించువారి లోకమెఱుఁగదో
యా నరకాసుర దమనుఁడు
దానెఱుఁగఁడొ భోజకన్య తా నెఱుఁగ దొకో.

ఉ. ఆ సరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁడుండుటం
జేసి యొసంగెఁబో తగవు చేకొని యొక్కలతాంతమింతలో
వాసియు వన్నెయుం దగవు వైభవముం జలమున్వివేకమున్
బో సవతుల్బరించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమి చెప్పుదున్.

క. కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడు పురుషులు గలుగుట
తొలిజన్మము నోముఫలము తోయజనేత్రా.

సీ. కలలోననైన నవ్వులకైన నామాట
జవదాటఁ వెఱచు నో చంద్రవదన
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుఁ బోఁడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చునో చంచలాక్షి

తోడిచేడియలు నాతోడి వంతులకు రా
నయిరింపఁ జాలఁడో సన్నుతాంగి
తే. యరమరలులేని కూరిమి నన(గి పెన(గి
కొదలు తీరని కోడ్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగని మమతలఁ గలసిమెలసి
యున్నవిభుఁడిట్లుసేయునే యోలతాంగి.
క. పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడుమేర దప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా.
క ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు మగఁడింతులకున్
దినదిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు చెపుమా
క. అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమున, గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరి చం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్.
ఉ. మాసినచీరగట్టికొని మౌనముతోడ నిరస్తభూషయై
వాసెనకట్టుగట్టి నిడువాలికకస్తురి పట్టు వెట్టి లో
గాసిలి చీకటింటికడ కంకటిపై జలదాంత చంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢ మనోజవిషాదవేదనన్.

పారిజా. హ. 1. ఆ. 82

# ధూర్జటి

సుమారు నూరేసి పద్యములు గలిగి సాధారణముగా నొక దేవతను సంబోధించుటతోఁగాని, యేదే నొక విషయమును ఆధారముగాఁ జేసికొనిగాని రచింపఁబడిన శతకము లనఁ బడెడి కావ్యములు మిక్కిలి ప్రచారములో నున్నవి ధూర్జటియను మహాకవి కాళహస్తి మాహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకము అను రెండు ప్రశస్త గ్రంథములు వ్రాసెను.

ఇచట నీయఁబడిన పద్యములు కాళహస్తి శతకములోనివి. ఇందు కాళహస్తి క్షేత్రమునకు నాథుఁడయిన శివుఁడు స్తుతింపఁబడి యున్నాఁడు. కవి మనోవృత్తులు. లోకవృత్తము తెలుపు వర్ణనలందందు ఈ పద్యములలో నుండును, ఈతనికాలము సుమారు 1500 - 1550. ఈతడు శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవి,

## కాళహస్తీశ్వర శతకము

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తురవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రునకనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులులేని యాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదంబపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా!

చావంగాలము చేరువౌటెఱిఁగియున్ జాలింపఁగాలేక త
న్నేవైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో యేమందు రక్షించునో
యేవేల్పుల్ కృపఁజూతురోయనుచు నిన్నింతైనఁ జింతింపఁడా
జీవశ్రాద్ధముఁ జేసికొన్న యతియున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఆలంచున్మోడఁగట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాల వ్రాతము నిచ్చిపుచ్చుకొను సంబంధంబు గావించి యా
మాలర్కంబున బాంధవంబనెడి ప్రేమం గొందలంద్రిప్పఁగా
సీలన్సీల యమర్చినట్లొసఁగితో శ్రీకాళహస్తీశ్వరా!

తనువే నిత్యముగా నొనర్పు మదిలేదా చచ్చిజన్మింప కుం
డ నుపాయంబుఘటింపు మీగతులరెంటన్నేర్పులేకున్న త్రే
దని నాకిప్పుడే చేయఁగల కార్యంబున్న సంసేవఁ జే
సి నినుంగాంచెదఁగాక కాలమున నో శ్రీకాళహస్తీశ్వరా!

ఒసపారింగని యేడ్చువారు జముఁడా! సత్యంబుగావత్తుమే
మనుమానం బిఁకలేదు నమ్ముమని తారావేళ నారేవునన్
మునుఁగంబోవుచు బాససేయుటసుమీ ముమ్మాటికిన్ జూడఁగాఁ
జెనఁటుల్గానరు దీనిభావమిది వో శ్రీకాళహస్తీశ్వరా!

---

# తెనాలి రామకృష్ణుఁడు

ఈతఁడు 1495 - 1560 సంవత్సరముల నడుమ జీవించి యుండి నట్లును. కృష్ణదేవరాయల యాస్థానమునఁ గూడ నుండినట్లును ఊహింపఁ బడినది. ఈతఁడు పాండురంగమాహాత్మ్యము మొదలగు గ్రంథములు వ్రాసెను. ఈతని శైలియం దొక ప్రత్యేకత గలదు. ఈతని పేరు హాస్య రసమునకుఁ బ్రసిద్ధమైనది.

బ్రహ్మచర్యము దుస్సాధ్యమనియు, నెట్టివానికేని గృహస్థాశ్రమ మునఁ బ్రవేశించుట గమ్యమనియు యుక్తమనియుఁ జెప్పు నుద్దేశమున, మునివేషధారి యగు నింద్రునిచే నయుతు నుద్దేశించి చేయఁబడిన ప్రసంగము క్రింది పద్యములలోఁ గలదు. ఇవి పాండురంగమాహాత్మ్యము లోని అయుత నియుతోపాఖ్యానమునందలివి.

## గృహస్థాశ్రమము

మ. కులధర్మం బెడలించి, శ్రీగురునకుం గోపంబు పుట్టించి, మి
త్రుల సౌభ్రాత్ర నివాసదేశముల నీతోఁ బుట్టులం బాసి, ని
శ్చలతన్ వ్రేలెడ వృత్తిఁ గట్టుకొని, దుస్సాధంబు సుమ్మీ స్మర
జ్వలన జ్వాలిక సోఁకనీక నిలుపన్ జ్ఞానామృతస్వాంతమున్.

చ. చలన విహీనవృత్తి నటి సన్నపరాశరుఁడాదియైన య
య్యల యలరాయిపంటి హృదయంబులు నీరుగఁ జేయు బోయ పూ



విలుతున కెంతదొడ్డపని వెన్నెలబిట్టని కాసినంత లో
పలన కరంగి పొంగు పసిబాలురచిత్తము మెత్తచేయఁగన్.

మ. లలితాగారవిహారులై, మణిమయాలంకారులై, శీల వ
ల్లల నాలాలితులై, యమూల్యమృదుచేలద్యోతితాకారులై,
కలమాన్నప్రియులై, సుగంధధరులై, కందర్పనింబోని భూ
తలనాథుల్ జనకాదు లొందిరికదా తత్తాదృగానందముల్.

మ. కలలోవార్తలు విప్పిచెప్పెదుక్రియన్ గాథాపురాణార్థముల్
దెలుపన్నేర్తురుగాని నేరరుసుమీ తీవ్రవ్రతాచార శ
ష్కులై యుండెడు ముండధారులు సుముక్షుల్; డాయఁగాఁజింతకా
యలకజ్జాయముతోయ మింతచదరంబా తత్పరిష్వంగమున్.

మ. వర సారస్వతపట్టభద్రుల్ కవుల్ వర్ణించి వర్ణించియున్
సరసావంతయుఁగానలేరు తుది యోషావిభ్రమాంభోధికిన్;
విరసాంతః కరణుండపై యెటులుగా నిందించెదోయయ్య! త
త్సరసాకార ముదారమన్మథ కళా సర్వస్వ శృంగారమున్.

సీ. కీలారమున నుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేలఁబండి యొరఁగ
నెడనెడఁ బెంపుడ్లు పసుగులు వాడమఁ గృ
తార్థులై యర్థించు నర్థు లలరఁ
బరిచారికాకోటి పనిపాటు పాటింపఁ
జుట్టంపు సందడి నెట్టుకొనఁగ
గ్రామమెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షి గోర

తే. నిత్యనైమిత్తకములు నిర్ఛిద్రబుద్ధి
నాచరించుచు హరిభక్త మాత్మ భార్య
భక్తి నిడ ముక్తిఁ గొనుచున్కి ముక్తికాని
నిదురవంటిది జాతివంటిదియుఁ గాదు.

పాండురంగ మాహాత్మ్యము. ఆ. 5 ప. 211 - 216

---

# చరిగొండ ధర్మన

ఈతఁడు 1480 - 1530 ప్రాంతమున నుండినవాఁడు. ఈతఁడు వ్రాసిన చిత్రభారతము నుండి రెండుపద్యములిచట నీయఁబడినవి.

మొదటిది యొక కాంత రూపవర్ణనము.

రెండవది వర్షర్తువును గూర్చి రచించినది.

## ఒక తొయ్యలి

చ. కమలజుఁ డీ పధూటి యలికంబటుచూచి మునిద్రుమప్రసూ
నము నొనరించి పోలదని నవ్వుచుఁ జెట్లనుగట్టి క్రొన్నెలం
గ్రమమునఁ జేసిన న్నవతు రామికి రోసి నవోడు రాజునుం
దమకముతోడ నాకసమున న్వడిఁ బాఱఁగవైచె సిగ్గునన్.

చిత్ర. భా ఆ. 3. ప. 68.

## వర్షర్తువు

చ. కరములు చాఁపి వడ్డిడుటకై బుధశుక్రుల సాక్షివెట్టి య
య్యరుణుఁడు భూమిచేతఁ దగ నప్పులు గైకొని యియ్యకున్నచో
ధరతన మూలవృద్ధులకుఁ దక్కకసాగిన వారిఁగూర్చి య
క్కఱ గుడివ్రాసి యీఁగె ననఁగాఁ బరివేషము పుట్టె నత్తఱిన్.

చిత్రభారతము ఆ 2. ప. 16

# సారంగు తమ్మయ

విప్రనారాయణుని చరిత్రము తెనుఁగులో అనేక విధములగు కావ్యరూపములను సంతరించుకొన్నది. సారంగు తమ్మయ రచించిన వైజయంతీవిలాసము వానిలో నొకటి. ఇది చిన్న ప్రబంధము.

విప్రనారాయణునకు అరవపేరు "తొండరడిప్పొడి యాళ్వారు". ఈతఁడు పరమ వైష్ణవభక్తుఁడు. దేవదేవి యను వేశ్యయొకతె ఈతనిని లొంగఁదీయఁగలనని యక్కతో పందెమువేసి, యాతని సమీపించి సేవించి తన వలలో వేసికొనును. ఆమె సాంగత్యమున విప్రనారాయ ణుని మనస్సెట్లు కరఁగెనో యిందు వర్ణింపఁబడినది. తమ్మయ 16 వ శతాబ్ది నడుమ నుండినవాఁడు.

## ఆచార్య హృదయము

క. వటుమానస సుక్షేత్రముఁ
గుటిలాలక చేష్టితముల గుద్దలిగొని యి
ట్టటు పాదుచేసి మోహపు
వటబీజము మరుఁడు నాఁటి వర్ధిలఁజేసెన్.

క. ఐహిక సౌఖ్యంబుల ని
ర్మోహుండగు వటునికత్తరుణి సద్భావ్య
స్నేహం బతి పరిచయమున
మోహంబై బుద్ధిచలన ముంజేయుటయున్.

సీ. ఆకాంక్ష తెప్పవేయకచూచు ననిశంబుఁ
దలఁపు చేతనె తృప్తిఁ గొలుపుమదికి
వనజాక్షి కౌంగు సోఁకిన మేను గరుదాల్చు
మొగము విప్పుగజేయు మగువ నగిన
నర్థి నొయ్యనఁగోర్కి నడుగ నుద్యోగించు
నడుగఁ జాలమి నేఱకనుచు మానుఁ
జెలిపల్కు మెచ్చి కోయిలపల్కు దూషించు
నధరంబుమాధువున కాసఁజెంద

గీ. శిరసుపైఁబేను బొడగన్నఁజేరఁబోయి
హింససేయకుమని చేతికిచ్చుఁదిగిచి
తన్మయతనొంది కలికచేఁతలనె హరి ప
రాయణుండైన విప్రనారాయణుండు.

శా. ఆవిప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావంబంగన సాహచర్యగుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారులై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూలై తన్మరందమై కరఁగెఁబోఁబో నీళ్లకుంబల్చనై.

గీ. గారఁద్రావిన మీనుసంగతి మనోజ
వేదన నతండు పొరలంద న్వియు నెఱింగి
తన వలకుఁ జేరెఁబో బోఁడి దాసరనుచు
డెందమునఁ జాలసంతస మందెనంత.

సారం. త. వై. వి. 2 అ 136-140.

---

# సంకుసాల నృసింహకవి

ఇతఁడు కవికర్ణరసాయనమను పేర మాంధాతచరిత్రమును కావ్యముగా వ్రాసెను. పూలమ్మ గరితల సంభాషణ మీక్రింద పర్ణింపఁబడినది.

ఈతఁడు 16 వ శతాబ్దము మొదటిభాగమున నుండినట్లూహింపఁబడినది.

## పుష్పలావిక

సీ. కరముల కందిచ్చు విరుల బంతుల కంటె
వెడఁదోఁచు చన్నులు వేడ్కఁ బెనుప
మవ్వంపుఁ గొన నెత్తు పువ్వుబెత్తులకంటెఁ
గరమూల రుచి చూడ్కిఁ గమిచి తిగువఁ
గోరిన నొసఁగెడు కొసరు పువ్వులకంటె
మొలకనవ్వులు డెందములఁ గరంప
నించారు సరముల నెత్తావి గమి కంటె
సుముఖ సౌరభములు చొక్కఁ బెనుప

ఆ. జట్టికాండ్రఁదమదు సరస సుందరవిలా
సముల చేతఁ దారజట్టి గొనుచుఁ
బురమువీధులకును భూషణప్రాయమై
క్రాలుఁ బుష్పలావికాజనంబు.

కవిక. రసా. ఆ. 1. ప. 21.

# మొల్ల

ఈ కవయిత్రి 16 శ. పూర్వభాగమున నుండినట్లూహింపఁబడినది. ఈమె వ్రాసిన రామాయణము రసమయమై సులభశైలిలో నున్నది. అందలి హనుమత్సందేశము ఈ క్రింద నీయఁబడినది.

## హనుమత్సందేశము

ఆ. అనుచు దనుజకాంతలంతంత నెడఁబాసి
నిదురవోయిరంత నదరి సీత
తనకు దిక్కులేమి దలపోసి దుఃఖింపఁ
బవనసుతుఁడు మనుజభాషఁ బలికె.

క. ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁ డిదె కపులఁగూడి యురుగతి రానై
యున్నాఁడు నిన్నుఁ గొనిపో
నున్నాఁ డిది నిజము నమ్ము ముర్వీతనయా!

సీ. ఆమాట లాలించి భూమిజ తనలోన
వెఱఁగంది శింశుపావృక్ష మరసి
చూడంగ నప్పుడు సూక్ష్మరూపంబున
నాడికమౌ శాఖల నడుమ నున్న

కపికుమారుని రూప మపురూపముగఁ జేసి
స్వాంతంబులోన హర్షంబు నొంది
దనుజమాయలచేత దఱచు వేఁగుటఁజేసి
మాటాడనేరక యూరకున్న

తే. భావ మూహించి తన్ను నాదేవి యాత్మ
నమ్మకుండుట దెలిసి యాకొమ్మమీఁది
నుండిక్రిందికి లంఘించి నిండుభక్తి
మ్రొక్కి నిలుచుండి కరములు మోడ్చిపలికె.

ఉ. తమ్మునిఁగూడి పుణ్యగుణధాముఁడురాముఁడు వచ్చి మాల్యవం
తమ్మున సైన్యసంఘము ముదంబునఁ గొల్వఁగనుండి భూమిపై
మిమ్ముఁ గాంచి రండనుచు మేటికపీంద్రులఁ బుచ్చి యందు మొ
త్తమ్ముగ మమ్ముగొందఱను దక్షిణభాగముచూడఁ బంపుచున్.

క. అంగనఁ బొడగన నీ వి
య్యంగను గడుఁ జాలువాఁడ వంచును నాచే
నుంగర మంపెను శ్రీరఘు
పుంగవుఁ డిదె కొమ్మటంచు భూమిజ కిచ్చెన్.

ఉ. ఇచ్చినఁజూచి రామధరణీశ్వరుముద్రికగా నెఱింగి, తా
నిచ్చను మెచ్చి యాకువలయేక్షణ యాత్మగతంబునందు నీ
వచ్చినదానిభావమును వల్లభుచందము నేర్పడంగ నేఁ
జెచ్చెర నంతయుందెలియఁ జెప్పుము నమ్మికపుట్టునట్లుగన్.

వ. అని విచారించి యిట్లనియె.

క, విను విశ్వసింపఁజాలను
వినుపింపుము నీతెఱంగు విభుని విధము నా
కనవుడుఁ బావని తెలియఁగ
వినయంబున విన్నవించె విస్ఫుట ఫణితిన్.

ఉ, రాముని డాఁగురించి నిను రావణుఁ డెత్తుకవచ్చువేళ నీ
హేమవిభూషణావళుల నేర్పడ ఋశ్యమహాద్రిపై చినన్
మేమవి తీసి దాఁచితిమి మీపతి యచ్చటి కేఁగుదేరఁగాఁ
దామరసాప్తనందనుఁడు తానవిసూపినఁ జూచి మెచ్చుచున్.

సీ. అర్కసంభవునకు నభయంబు దయచేసి
దుందుభికాయమ్ముఁ దూలదన్ని
యేడుతాడుల సర్వమేకమ్ముగాఁ ద్రుంచి
వాలి నద్భుతశక్తిఁ గూలనేసి
సుగ్రీవునకుఁ దారసుదతిగా నిప్పించి
యంగదు యువరాజనంగ నిలిపి
వారలతోడను వానరసైన్యంబు
లెన్నేనిఁ గొలువంగ నేఁగుదెంచి

తే. మాల్యవంతంబునందుండి మనుజవిభుఁడు
నిన్ను వెదకంగ నందఱ నన్నిదిశలఁ
బనుచునప్పుడు దక్షిణభాగమరయ
నంగదునితోడఁ గొందఱ మరుగుదేర

తే. వారిపంపున నవలీల వార్ధిదాఁటి
వచ్చి సకలంబుఁజూచి యీవంక గంటి

రావణుఁడు వచ్చి నిన్ను నుగ్రంబుగాఁగఁ
బలుకు నప్పుడు నున్నాఁడఁ బాదపమున.

వ. ఇవ్విధంబునఁ బలుకుచుండినను నమ్మక యతనిం గనుం గొని రాముఁడేరీతివాఁడో యతని చందంబెఱింగింపు మనవు డా వాయు నందనుఁడు రఘునందనునకు వందనంబాచరించి భూమినందన కిట్లని చెప్పుచున్నాఁడు.

సీ. నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జ పత్ర నేత్రములవాఁడు
కంబుసన్నిభమైన కంఠంబుగలవాఁడు
బాగైనయట్టి గుల్ఫములవాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాఁడు
ఘనమైన దుందుభి స్వనమువాఁడు
పద్మరేఖలుగల్గు పదయుగంబులవాఁడు
చక్కని పీన వక్షంబువాఁడు

తే. కపటమెఱుఁగని సత్యవాక్యములవాఁడు
రమణి ! రాముఁడు శుభలక్షణములవాఁడు
ఇన్నిగుణముల రూపంపనెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారువన్నెవాఁడు

తే. ఉరుతరాటవిలోన మహోగ్రతపము
వాయుదేవుని గుఱియించి వరుసఁజేసి
యంజనాదేవి గనియె నన్నర్థితోడ
నర్కజుని మంత్రి హనుమంతుఁడండ్రు నన్ను.



16

వ. అని యిట్లు తాత్పర్యంబునఁ బట్టునట్లుగా విన్నవించి, దేవీ! నీ దేవుండయిన శ్రీరాముండు నా చేతికిచ్చి యంపిన యీ రత్నంగు శీయకంబు నీకు సమర్పించితి నింక నాకు రిక్తహస్తంబులతోఁ జనుట దూతల కుచితమైన కార్యముగాదు. గావున నిన్ను దర్శించునందులకు శ్రీరామునకును నమ్మికపుట్టునట్లుగా నీ శిరోరత్నంబు దయచేయవలయు ననుటయు నా కుశేశయ నయన యిట్లనియె.

క. నానాథు సేమమంతయు
ధీనిధి నీచేతవింటి దెలియఁగ నైనన్
నీ నిజరూపము చూడక
నేనారత్నంబు నమ్మి నీకీయఁజూమీ.

వ. అనుటయు నా హనుమంతుఁడు,

క. చుక్కలు తలపూవులుగా
నక్కజముగ మేనువెంచి యంబరవీధిన్
వెక్కసమై చూపట్టిన
నక్కోమలి ముదమునందె నాత్మ స్థితికిన్.

వ. ఇట్లు తన మహోన్నతరూపంబు చూపి యెప్పటియట్ల మరల సూక్ష్మరూపంబు గైకొని నమస్కరించిన నాహనుమంతునకు నద్దేవి తన శిరోరత్నంబు ననుగ్రహించి యిట్లనియె.

చ. రవికులవార్ధిచంద్రుఁడగు రాముని సేమముచాలవింటి నా
వివిధములైన పాట్లు పృథివీపతికిందగఁజెప్పఁగల్గె నేఁ
డవిరళభంగి నీవలన నచ్చుగ నేనుపకారమేమియుం
దవిలి యొనర్పలేను వసుధాస్థలి పర్థిలు బ్రహ్మకల్పముల్.

వ. ఇట్లు దీవించి మఱియును

క. ఏ యెడఁజూచిన ధరణీ
నాయకు శ్రీపాదాయుగము నాచిత్తములోఁ
బాయదని విన్నవింపుము
వాయుతనూజుండ పుణ్యవంతుఁడ తెలియన్.

తే. ఇపుడు రావణుఁడేతెంచి కపటబుద్ధి
గర్వమునఁజేసి నన్నెన్నికాఋలాడె
నన్నియును నీవు చెవులార విన్నతెఱఁగు
పతికి దయపుట్టఁగా విన్నపంబుసేయు.

సీ. నిడుఁద పెన్నెఱివేణి జడలగా సవరించి
మలిన జీర్ణాంబరం బొలియఁగట్టి
భూమీ రజంబు విభూతి పూఁతగఁబూసి
తన దివ్యమూర్తి చిత్తమున నిల్పి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మ మంత్రంబు పఠించుచుఁ
గఠిన రాక్షస దుర్మృగములలోన

తే. నహితలంకా మహా ద్వీపగహనసీమఁ
దపముసేయుచునున్నాను దన్నుగూర్చి
నాకుఁ బ్రత్యక్షమగుమని నాథునకును
విన్నవింపుము సత్త్వసంపన్న, నీవు.

—మొల్లరా. సుం. కా. 90-113. ప.

# పింగళి సూరన

ఆంధ్రకవులలో నీతఁడు మిక్కిలి పేరుగన్నవాఁడు. స్వతంత్ర కావ్యసృష్టి చేసినవాఁడు. అనేక భిన్నమార్గములను త్రొక్కినవాఁడు.

ఈతఁడు వ్రాసిన కళాపూర్ణోదయములోని సుగాత్రీ శాలీనులను దంపతుల చరిత్రమిందు గ్రహింపఁబడినది. కళాపూర్ణోదయము కథ సంస్కృతమునందలి కాదంబరివంటి చిక్కుకథ.

కాలము 1520 - 1580.

## సుగాత్రీ శాలీనులు

సీ. కాశ్మీరభూమికిఁ గర్ణికయగు శార
దాపీఠమున శారదను భజించు
పూజారి బ్రాహ్మణు పుత్రి యొకర్తు సు
గాత్రి నాఁ బరఁగెడు కాంతగలదు
దాని వరుండు శాలీనాహ్వయుం డిల్ల
టపుటల్లుఁ డత్తయింటను వసించు
నాతండు దనకడ కాకన్యఁ బ్రథమసం
గమవేళఁ గడునలంకార కలితఁ

ఆ. జేసి యనిపి దాని చెలు లింతనంతను
బొంచియుండఁ దద్విభూషణాది

మహిమఁ దలఁకి పట్ట మదిని సంకోచించెఁ
దరుణి యుండియుండి తిరిగిపోయె.

ఉ. పోయినఁ దద్విధంబపుడు బోంట్లు తదంబకుఁ జెప్పి భూమిలో
నేనెడ లేనిచంద మిదియేమినిమిత్తము యంచు, మంచిలేఁ
బ్రాయపువాఁడు గల్గె బళిరాయితఁడంచు, నెసైన నేఁటికిం
బోయెను కాక యెల్లితమపోకలు చూఁడమయంచు నవ్వినన్.

క. ఆయన వినఁ బ్రేలెదరు సుఁ
డీ యిట్లు గయాళులార! డిగవిడుతురు ల
జ్జాయుతులు సర్వమును దము
నే యెడ హాస్యాస్పదం బొకింత వొరసినన్.

గీ. అని పలికి రెండుమూఁడు నాళ్ళట్ల యనిపె
నల్లునొద్దకుఁ బుత్రిక నపుడతండు
నాది నేభావమునఁ జూచె నట్లచూచె
వట్టి రాకపోకలొనర్చె వానిసతియు.

వ. అంత లజ్జావతికిఁ దజ్జనని యనుమతిఁ బ్రియవయస్య లేకాంతంబున నిట్లనిరి.

గీ. పొలఁతి, యాలుమగల పోఁడుములేమియుఁ
గలిగినట్టి చొప్పు గాన రాదు
మీ తెఱంగుచూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకులేమి చెప్ప?

క. కాంతుఁ డుచితజ్ఞుఁడైనను
గాంతకు సిగ్గువడఁజెల్లుగాక, కటకటా!
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్లైన నెట్లు కాఁపుర మింకన్.

క. గారామునఁ దోడ్తోడన
రా రమ్మనఁ దనుచు మగిడి రానేటికిఁ? గ
ర్పూరంబుతోడి బాగా
లీరాదో? యాకు మడిచి యీరాదా? చెలీ!

క. అన విని యీపెడమాటల
నను నేటికిఁ జంపెదరు? వినన్ సైఁపవు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ
డొనరిచి చూచెను దదీయ యుక్తులతెఱఁగున్.

వ. చూచి యెందును ఫలంబు గానకుండె. అంత నొక్కనాఁడు తల్లి యమ్మెఱుంగుఁబోఁడితోడ

ఉ. ఇట్టి నిరర్థ మెందుఁగన, మేమనఁబోయిన నీవు మిక్కిలిం
దిట్టెదు, నాదు సంపదకు దిక్కగుచున్ మగమొల్కనీకిఁకన్
బుట్టునొ యంటిమే నితని పోఁడిమి గంటిమ వట్టిగొడ్డు తా
కట్టితఁడెంతయున్న, నినుఁ గాఱియ పెట్టుట వెళ్ళఁగొట్టినన్.

ఉ. పూవుల తోఁటకైన నటువోయి విచారముచేసి రమ్మనం
గా వలయుంగదా యనుచు గారవమొప్పఁగనట్లు పిల్చి-ము
న్నావిధికంపి, యందుఁగలయట్టిపనుల్ సకలంబుఁజేయ నే
ర్పావహిలంగఁ దానతని నంతటఁ గట్టడసేసెఁ జేసినన్.

గీ. దివిజనుతమైన శారదాదేవి పూజ
కుపకరించు కార్యంబిది యొప్పుననుచు
నధికమోదంబుతో నతండాదరించి
సంతతంబు తదేక నిష్ఠత దలిర్ప

క. సమధిక మధుమదగరిమా
సమచంచలచంచరీక సంచయ సంచా
ర మనోరమ సుమనోరమ
నమరఁగ నాపూవుఁదోఁట యనిశముఁ బెంచెన్.

క. ఎంతయుఁ బ్రొద్దునలేచి ని
తాంతాచరిత స్వజాతి ధర్ముఁడగుచు ని
శ్చింతుఁడయి గురుపరంపర
చింతించి తదుక్తజపముచేసి ముదముతోన్.

గీ. నియమమునఁ బుష్పములఁ గోసి నేర్పుమీఱఁ
బలు తెఱంగుల వింతవింతలుగ మాలి
కలును బొందులఁ గందుకంబులు రచించి
బ్రహ్మయిల్లాలికిని సమర్పణము సేయు

వ. అప్పుడు సుగాత్రి పాతివ్రత్యధర్మనిష్ఠకతంబున

చే. తల్లిమాటలచే నిట్లు తన విభుండు
తనులు బడలంగఁ బూఁదోఁటఁ బనులు సేయఁ
జూడనోర్వక తాను నచ్చోటికరిగి
తోడుపడియెద ననిచూచు వ్రీడ నుడుగు.

వ. అప్పుడొకనాఁడు శాలీనుండు తోఁటకుం జనియుండ.

క. ధళధళమెఱపులు మెఱయఁగఁ
బెళపెళ నుఱుముచుఁ బెఠిల్లు పెఠిలునఁ బిడుగుల్
నలుఁగడఁ బడ బెడిదపు ధా
రలు గల బలువాన జలధరంబులు గురిసెన్.

క. అట మున్ను మొగులు బలియుచుఁ
జిటపొటమని పాటపాట చినుకులువడఁ జొ
చ్చుట యాదిగాఁగఁ దన పెని
మిటి దడియునొ యని సుగ్రాతి మిగుల వగపుతోన్.

వ. అతనికి శుభంబు గోరుచునికింజేసి, తనహృదయంబునఁ దమ కులదైవతంబైన సరస్వతింబ్రార్థించుచు నంతట నిలువంజాలక తద్వర్షఘోరతయుఁగైకొనక తల్లియు నెఱుంగకుండనిల్లు వెడలి ప్రాణవల్లభుండున్న వనంబునకరిగి కడనయుండి పరికించి యప్పటి యవ్వాత వర్షోపద్రవం బొక్కించుకయులేక యాత్మసంప్రార్థితబ్రాహ్మీ ప్రసాదవిశేషంబున నెప్పటియట్ల శుభవర్తనంబుననున్న తన భర్తను దదారామంబును జూచి, నాతల్లి! యోసరస్వతి! నీ భక్తవాత్సల్యచింత ప్రకటించితే? యని తత్కారుణ్యంబునకు నుబ్బుచుఁ, గ్రమ్మఱి గృహంబునకువచ్చి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లు చుండె. మఱియుఁ గొన్ని దినంబులు లజ్జపెంపున వల్లభుని యిడుమపాట్లకోర్చియోర్చి

ఉ. అంతట లజ్జ క్రిందుపడ నత్యధికంబుగ మించి మానసా
భ్యంతర పూర్ణమైన పతిభక్తి కతంబునఁ దల్లిమాట యొ
క్కింతయుఁ దానుగైకొనక యెప్పటియట్ల యలంకృతాంగియై
యెంతయు నింపుతోడఁ జనియెం బ్రియుఁడున్న వనంబులోనికిన్.

క. చని యాతఁడు తాఁజలి పెడు
పనులకు నీయకొనకున్న బలిమిన కడఁగెం
దనసొమ్ములెల్ల నొకమఱుఁ
గున నిడి పిరిచుట్టచుట్టుకొనిన వలువతోన్.

గీ. పడఁతి సంభ్రమించుచు నిట్లు పనులుసేయఁ
బఱుఁదుఁ బాలిండ్లుఁగొప్పుఁ గంపించుచొప్పు
గనుఁగొనుచు నేర్చుకొనుగతిఁ గొంతు మదిని
బెల్లు శరములవై చె దర్పించి మరుఁడు.

చ. అపుడతఁడట్లు పేర్చు కుసుమాస్త్రుని యుద్ధతియాఁపలేక వె
ఱ్ఱిపడుచ, యెంతమాన్చిన నెఱింగెడువానవుగావు నీకుఁ దోఁ
ట పనులకెంతదూరమకటా ! యనుచుం దనయుత్తరీయ వ
స్త్రపు మునికొంగునందుడిచెఁ దన్వి కపోలపుఘర్మబిందువుల్.

చ, తుడిచినఁబోక మన్మథుని దుర్జనతామహిమన్ బొరింబొరిం
బడతి మెఱుంగుచెక్కిళులఁ బర్వెడు ఘర్మముఁగాంచియంత నా
బడలికచూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగితంచు నె
క్కుడు తమకంబుతోడఁ దలగ్రుచ్చి కవుంగిటఁగూర్చెనంతటన్

గీ. ఇట్లు దేర్చుచు సతి నతఁడెపుడు విడక
కౌఁగిట బిగించెఁ బైపయిఁ గాముఁడడర
నివి మిగులఁ గ్రొత్తలింటికి నేఁగ వలదె
యని ప్రియముఁజెప్పి విడిపించుకొనియె సతియు.

క. విడిపించుకొని మఱుంగున
నిడిన తనదు భూషణంబు లెల్లను బ్రేమం
దొడిగి గృహంబున కల్లన
నడచెం బతిచరిత్రభావనల మనమలరన్.

క. పసి వాళ్ల వాడి యప్పుడు
వసంత సమయంపుటెండవలన న్నెఱివోం
గసుగందులు గందిన నవ
కుసుమలతిక వోలె మిగులం గోమలి యొప్పెన్.

సూరన. కళా. 4. ఆ. 60- 105ప. మధ్య

# రామరాజభూషణుఁడు

ఈతఁడు వివిధములైన కవిత్వ చమత్కృతులు నెఱపఁగల్గిన మహాకవి. ఈతనికి శబ్దార్థములు రెండును పరిపూర్ణముగా లొంగినవి. ఈతఁడు వసుచరిత్రమను మహాకావ్యమును, హరిశ్చంద్ర నలోపాఖ్యాన మను ద్వ్యర్థికావ్యమును రచించి ప్రసిద్ధి నందెను. ఈతనికాలము 1530-1580. ఈతఁడే మూర్తికవియనుపేర నరసభూపాలీయమను గ్రంథమును రచించెనని యూహించుచున్నారు.

వసుచరిత్రమున కోలహలమను పర్వతము శుక్తిమతియను నదిని ప్రేమించినట్లు వర్ణింపబడినది. ఆ రెండింటియందును స్త్రీపురుష ధర్మములు ఆరోపించి చక్కని పదముల కూర్పుతో నీయన కథను సాగించెను.

క్రింది ఘట్టమున వారిరువురకును జరిగిన సంభాషణము గలదు.

## శుక్తిమతీకోలాహలుల సంవాదము

సీ. అతులశైవలవతీ శతములీనెడు మీకు
నాయిచ్చు విమలార్ఘ్యతోయ మెంత
ప్రాలేయ నిలయ సంభవము గాంచిన మీకుఁ
బన్నీట నొనరించు పాద్యమెంత

సరస మందార మంజరుల రంజిలు మీకుఁ
బెనఁచి పూదండలర్పించు టెంత
గోరత్నదోహన గురులక్ష్మి గల మీకు
నుపదగా మణివర్గ మొసఁగు టెంత
తే. యనఘ, యెవ్వారలైనఁ గొండంతవారి
కవనిఁ గొండంతపూజ సేయంగఁ గలరె
భక్తి నేనిచ్చు నీపుష్ప పత్రతోయ
మాత్రములు గైకొను టెకాక గోత్రతిలక.
చ. విలసిత రత్నకూటములు వేలుపుఁగన్నెలకూటముల్ సుధా
కలిత సరఃకృపీటములు కామిత నూతనవస్తుజాల దో
హల సురభూజ వాటము లొకప్పుడుఁ బాయక కల్గునీకు న
వ్వల నొక యర్థనీయమగు వస్తువు గల్గునె ముజ్జగంబులన్.
క. ఏతాదృశగుణగరిమ స
మేతాత్ములు మీరలిచటి కేతెంచుట యో
శీతాద్రి తనయ మదుపరి
జాతాభినవానురాగ సంపత్తిఁగదా.
చ. అనవిని గట్టురాకొమరుఁ డానన గహ్వర రోచమాననూ
తన తర దంత హీరరుచి ధారలు వెల్వడ నొక్కలేఁతన
వ్వు నగి నిజంబ పల్కితి వవున్ భువనాశయ సన్నివేశ వే
దిని సరసాగ్రగణ్యవు గదే యని యన్నదిఁ బల్కవెండియున్.
మ. పరమామోదముతో విశేషతటినీ పద్మాస్యలంగూడి నీ
వరవిందోద్భవు ఁగొల్చి యేఁగువుతఱి నీ యచ్ఛాచ్ఛభావంబు నీ

సరస్వతంబును నీగభీరతయు నీ సర్వంకషప్రౌఢి నీ
పరిపూర్ణత్వము గాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్.

శా. ఆ పద్మోద్భవు నోలగంబునకు దివ్య ద్వీపినుస్ నిచ్చరా
రో వోరో మఱియెందఱేనియును వారున్ మేము సంధింపమో
యే పద్మాననఁ జూచినం జెలియ, నిన్నీక్షించి నట్లుండ దే
లా పల్మాటలు పూర్వజన్మకృతపుల్ గాఁబోలు నీ నెయ్యముల్.

ఉ. నావలనంప్రియంబెటిఁగి నన్నొకమాఱును బల్కరింప కీ
వే వెస నోరఁజేసికొని యేఁగుదుగాని సరిల్లలామ, ని
న్నేచగఁ జేరవత్తు మదికింపగు నీదు నవోదితామృతం
బేవగఁ గ్రోలఁ గాంతునని యేనెపుడుం దలపోయుచుండుదున్.

తే. విమల మధుర మనోహరవృత్తి వెలయు
వారిఁ గొని యాడ బుధులెంత దూరమైనఁ
బోవుదురుగాన నేను నీ పొందు గోరి
దవ్వనక వచ్చితి నశేష తాపశమని.

ఉ, చెప్పెడిదేమి నాకుఁగలజీవనమంతయు నీకుఁగూర్చి యె
ల్లప్పుడు నిన్నుబాయక ప్రియాచరణంబొనరింప నేర్తు నీ
చొప్పున కీవు నియ్యకొని చొక్కపుజక్కవగుబ్బలాఁడి మేల్
దప్పక యంతరంగమునఁ దారిచి నన్ను నదీనుఁజేయవే.

క. అనవిని నగరాజుఘన
ధ్వని గరిమకుఁ గలఁగి ముకులిత కరాంబుజమై
వినయము నయంబు భయమును
మనమునఁ బెనఁగొనఁగ శుక్తిమతి యిట్లనియెన్.

సీ. నిలువెల్ల నీచాతి నీచోపసరణంబు
ప్రకృతి యెల్లను జాడ్య పరిణతంబు
పెంపెల్ల నియత గాంభీర్య మానవిహీన
మంతరంబెల్లఁ బంకావిలంబు
జీవనంబెల్ల నంచింత బుద్బుదప్రాయ
ముదయ మెల్లను దుర్దినోన్ముఖంబు
గతులెల్లఁ గుటిల ప్రకార కారణములు
త్సేకంబులెల్ల భంగాకులములు

తే. నిలుకడ హుళిక్కి తావులు పొలసువల్పు
నిట్టి మాటోంట్లతోఁ జెల్మి యెట్లుపొసఁగు
నచలితోత్తుంగ ధైర్యన కలఘుమతికి
ననఘ గతికి నభంగ శీలునకు నీకు.

క. పుడమి నచలేంద్రు లెచ్చట
జడవాహిను లెచట నెచటిసఖ్యము వినఁజో
ప్పడదు పొడవడరు మీయెడ
నెడపక మారసము లెచటి కెక్కు మహాత్మా.

ఉ. నావిని గట్టు తేఁడు వదనంబున విన్నఁదనంబుదోఁప నో
శైవలినీ శిఖామణి, నిజంబు భవత్కమనీయకాంతి ధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక మళ్లఁ బెట్టె దో
నీవిఁకగ్రుచ్చి యెత్తి ఘన నిర్వృతిఁ దెప్పలఁదేల్చెదోయనన్.

చ. వెలవెలఁబాఱి శుక్తిమతి వెండియుఁ గొండలజేనిఁ బల్కి న
గ్గలమగు పంచసాయకవికారమున్ నిజగౌరవోన్నతుల్
దలఁపవుగాని మాదృశజడస్థితిఁ జెప్పలఁ దేలుచున్న మీ
కులగిరి కోటిలోఁ గడులఘుత్వముగాదె తలంచి చూడుమా.

మ. మతిఁ గ్రీడారతి గల్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చి తపస్ఫూర్తిమెయిం గృశించి వనరాశిం జెందు మాబోంట్ల ను
ద్ధతిచేఁ గ్రమ్మఁగనేల నీకుఁగలవే తారుణ్యలావణ్య జృం
భిత రంభాది నిలింపభామలన భూభృన్మౌళి రాగాంధుఁడై.

—వసు. చ. 9 అ. 122-136.

# కందుకూరి రుద్రయ్య

శైవాచార సంపన్నుఁడైన యీ కవి సుగ్రీవవిజయమను యక్షగానమును, నిరంకుశోపాఖ్యాన మను ప్రబంధమును వ్రాసెను. కందుకూరు నందలి జనార్దనస్వామిపేర నొక యష్టకమును రచించెను. ఇది మిక్కిలి మనోహరముగా నుండుటచే నిందలి పద్యములు కొన్ని యిచట నీయఁబడినవి.

ఈతని కాలము సుమారు 1570 అని యూహింపఁబడినది.

## జనార్దనస్తవము

౧

సిరులు మించిన పసిమి బంగరు జిలుగు దుప్పటి జారఁగా
చరణ పద్మముమీఁద దేహము చంద్రకాంతులు దేరఁగా
మురువుచూపఁగ వచ్చినావో మోహనాకృతి మీఱఁగా
గరుడవాహన ! దనుజమర్దన ! కందుకూరి జనార్దనా !

౨

ఆన పెట్టిన రాకపోతివి ఆయెఁబో అటు మొన్ననూ
పూని పిలువఁగ వినకపోతివి పొంచి పోవుచు మొన్ననూ
నేనుజూడఁగఁ గడచిపోతివి నీటుచేసుక నిన్ననూ
కానిలేరా దనుజమర్దన ! కందుకూరి జనార్దనా !

౩

విన్నరాతిరి చవికలోపల నీవు పెలిఁగూడుంటి రా
ఉన్న మార్గము లన్నియును నేనొకతెచేతను వింటిరా
విన్నమాత్రముగాదురా నిను వీథిలో గనుఁగొంటిరా
కన్నులారా దనుజమర్దన ! కందుకూరి జనార్దనా !

౪

దబ్బులన్నియుఁ దెలిసికొంటిని తప్పుబాసలు సేయకూ
మబ్బుదేరెడి కన్నుఁ గవతో మాటిమాటికి డాయకూ
ఉబ్బుచేసుక త త్తరంబున నొడలిపై చెయివేయకూ
గబ్బితనమున దనుజమర్దన! కందుకూరి జనార్దనా !

౫

చి త్తరంబున మొలక కెంపులు పెదవి నెవ్వతె యుంచెరా
గు త్తమైన మిటారి గుబ్బలగుమ్మ యెవ్వతె మెచ్చెరా
చి త్తగించక జీబువాలను జెక్కు లెవ్వతె నొక్కెరా
క త్తిగోరుల దనుజమర్దన ! కందుకూరి జనార్దనా !

౬

అండబాయక కూడియుంటిని ఆమె పోయెను నాఁటికి
ఖండి మండిపడంగ నేటికిఁ గదలు మెప్పటిచోటికి
ఉండరా నీ మాటలకు నే నోర్వఁజాలను మాటికి
గండి దొంగవు దనుజమర్దన ! కందుకూరి జనార్దనా !

—చాటు, ప. మ. మంజరి. (జనార్దనాష్టకము-177-178 పు)



18

# పొన్నికంటి తెలగన్న

ఇతఁడు 16 వ శతాబ్దము రెండవ భాగమున గోలుకొండ నవాబుగా నుండిన మల్కిభరాముని కాలమున నుండినవాఁడు. తానువ్రాసిన యయాతి చరిత్రమును అమీనుఖాన్ అను నాయనకుఁ గృతియిచ్చెను. ఇది యచ్చ తెనుఁగు కావ్యము. ఇందు సంస్కృతము పరిహరింపఁబడెను.

ఒకయువిద పూలు గోయుట యిందు వర్ణింపఁబడినది.

## పుష్పాపచయము

సీ. బొట్టుగు లేమావిఁ బొదవించె నొక్కర్తు
చూచియుఁ జేనంటిసొబగు మీఱఁ
బొన్నఁ బ్రేంకణమును బూయించె నొక్కర్తు
చిఱునవ్వు నునుఁబాట దుఱఁ గలింపఁ
బొగడను గంగేళిఁ దగవిరుల్ గలిగించె
నెమ్మిఁ గల్లుమిసి తన్నియునొకర్తు
కొసరి వావిలిఁ గొండగోఁగును ననిపించె
మూర్కొని మాటాడి ముదితయోర్తు

గీ. క్రోవిఁ బావులు నిండించెఁ గొమ్మయోర్తు
కదిసి కూరిమి తోడుతఁ గౌఁగిలించి
చనుపకంబునఁ గ్రొన్ననల్ దనియనించె
ముదిత యొక్కతె తనముద్దుమోముచూపి.

- యాయాతిచరిత్ర. ఆ. 4.

# కాకమాని మూర్తికవి

ఇతఁడు 1560 ప్రాంతమున నుండినవాఁడు. పాంచాలీపరిణయము మొదలగు ప్రబంధములను రచించెను. ఇతని కవిత్వమనేక గుణములఁగూడి యున్నదని పేర్కొనఁబడినది.

క్రింది పద్యములు పాంచాలీ పరిణయములోని విందును వర్ణించు ఘట్టములోనివి.

## విందు

ఉ. విందులకెల్ల నేఁడిచట విందనినన్ సచివుల్ పురోహితుల్
గొందఱు బజ్జి పచ్చడులు గూరలు చారులు పిండివంట లె
ల్లం దగఁదెచ్చి రైందప శిలాకులతుందిల పాకమందిరా
ళింద బహిర్మహీరచిత లేఖమణీ ఖచితాగ్రవేదికిన్.

క. వంట యొకించుక చేయుం
డంట ల్విన్నారొలేదొ యచటి సువారం
బింటి కలకంఠు లొక గడె
యంటనె కావించి రీశ్వరాయతమునకున్.

మ. సిలువంబోయిన యంగజాలతరువుల్ బీరమ్ములన్ దొమ్మ పె
క్కులు పూఁతల్ గసివెంద యెత్తు బురుసా కుళ్ళాయ లందంపుఁజే
తుల గందం బరచట్టకుంకుమలు కత్తుల్ హత్తి గేహోల్పభో
జులునై యెమ్మెల భోజనంబులకు రాజుల్ వచ్చి రచ్చోటికిన్.

క. విందున కరుదెంచిరి తల
కుందగు దోవతులు పట్టుకోకలు వెంటం
గొందఱు పిల్లలు జతగా
నాందోళికలం బురోహితామాత్యవరుల్.

మ. బుడుతల్ పెద్దలు వీజనంబులును జెంబుల్ గొప్ప దొప్పాకులున్
నిడి యందంబుల చొప్పయీనెలొక యింతే ప్రొద్దుపోకుండ నాఁ
గడువీరల్వలెఁ బెట్టరాదనుటలుం గన్పట్టఁగా నూరిగా
మిడి బాపల్బసు దెంచిరా ద్రుపదభూమీభర్త యిల్చేరఁగన్,

క. తెప్పలుగా దొప్పలు మఱి
దొప్పలకుం దగిన యాకు తుది నాకులకుం
జెప్పనగు పసిఁడి చెంబులు
నప్పార్థివుఁ డేర్పరించె నయ్యెడ నెడకున్.

క. కడ లేని వెడలుపెంతే
నిడివియు నగ్రముల తగులు నిగనిగలిగురుం
గడిమిగల యనఁటి యాకుల
యెడఁజూచినఁ గడుపునిండదే భోక్తలకున్.

ఉ. ఇక్కడఁ గూరుచుండుటల కీరలె పెద్దలు లేచిరండు మీ
రొక్కరు వంటశాల కడు యోగ్యము మీకది తేమకేమి యీ
ముక్కలి పీఁటమీది యదిమూర్ఖుల చోటిట మేలటంచు స
ద్వాక్కుల నక్కులాధికుల పై దికులం దగు చోట నుంచినన్.

ఉ. వడ్డనచూపిరంతఁజెలువల్ తెలియోగిర మొల్బు పప్పు మెం
డొడ్డిన కూరగాయ ఘృతముక్కెర చక్కెర తేనె లడ్డువా

లిడ్డెన నానవాలు చలియించని తైరులు మోరు మేరు పై
గిడ్డిఁ దలంచిరో యనఁగ గేస్తుల కబ్బె సమస్త భాగ్యముల్.

క. చేత మెతు కంట కుండన్
శీతాభోగముల వారిచిన యోగిర మా
రా తుమ్మి పూల తెలుపా
హా తావి యయారె వేఁడి యని పేఁడి రొగిన్.

క. ధూర్తులు ధిక్కారీచ మ
వార్తాక 'మటంచు మరిచ వర్ణన గనుచున్
గీర్తించిరి తొడిమన్ ధి
గ్వార్తాక మవృంతక' మని వంకాయఁ దగన్.

సీ. అమృతోష్ణ పక్వతా వ్యక్తంబు భుక్తంబు
గ్రామాంత రాపణా గతము ఘృతము
పవమాన సఖముఖాపాకంబు శాకంబు
లసదామ్లలవణ నీరసము రసము
ప్రోద్ధూత శర్కరా రూపంబు పూపంబు
విగళిత మాధుర్య నగరి సిగరి
యంబుగోధస్య ఖిన్నంబు క్షీరాన్నంబు
హత శుచి రుచిపాలు నానవాలు

గీ. చారులేకావు బజ్జి పచ్చళ్ళు తీరు
పేరుకోకున్న యీతైరు నీరుమోరు
నెటుల భుజియించెద రటంచుఁ గృపఁ దలిర్ప
ద్రుపద నృపదర్ప కుండవ్వ డుపచరించె.

—కాకమాని మూర్తికవి పాంచాలీపరిణయము (4ఆ.34-53మధ్య10ప.)

# పుష్పగిరి తిమ్మన

ఈతఁడు 1575-1632 మధ్యమున నుండినకవి. సమీరకుమార విజయ మనుపేర తెనుఁగుననొక కావ్యమురచియించె. అందు హనుమంతుని చరిత్రము వర్ణింపఁబడినది.

క్రిందిభాగమున హనుమంతుని విద్యాభ్యాసము వర్ణింపఁబడినది.

## విద్యాభ్యాసము

మ. జలజాతాప్తునకుం బ్రదక్షిణనమస్కారాలు గావించి మున్
బలినర్దించి త్రివిక్రమస్ఫురణఁజూపంబూను విష్ణుండునుం
బలెఁదారల్ మొలనూలు ముత్యముల రూపంబూన నానాదిశా
వలయవ్యాపకుఁడై కపీంద్రుఁ డలరెన్ స్వైర ప్రచారోద్ధతిన్.

మ. హనుమద్దేవుని దివ్య విగ్రహము బ్రహ్మాండంబునన్నిండినం
తనె తద్వ్యాప్తిఁ బటీలునం బగిలి కానన్వచ్చు ఛిద్రంబొకో
యని తత్కర్పర మధ్యరేఖగని భాషాధీశుఁడుద్భ్రాంతుఁడై
మొనయంజేయఁగ నేఁగుదెంచి తిరిగెన్ మున్నున్నతీరెన్నుచున్.

సీ. సంధ్యా ప్రభతారకా సముదయాభ్యుదయంబు
వలె నురంబున హారములు వెలుంగఁ
బూర్వాస్త శిఖరాగ్రముల మించు సూర్య చం
ద్రుల దండిఁ గుండల ద్యుతి చెలంగఁ

గమల గర్భాండోర్ధ్వ కర్పరచ్ఛ త్రకాం
డము లీల వాల మున్నతి వహింప
మువ్పేట ముంజితో మొనయు మేఖలరేఖ
ధరియించి వలయ భూధరము వెలయ

తే. జననిరూఢి విరాట్ ప్రౌఢి నవఘశించు
కపి విరాడ్వృత్తి సర్వదిక్కలితుఁడైన
మునులు దివిజులు "హర యే నమోనమోస్తు
తే"యని నుతింప నతఁ డుగ్రతేజుఁడగుచు.

క. పదరక యొక గడియకుఁ దొ
మ్మిదిలక్షల యోజనముల మీఁదన్ మఱిడె
బ్బదివేలు దిరుగురవిక
బ్టెదుర నతనికంటె వడిఁగపీంద్రుఁ డరుగుచున్.

సీ. పాడి పదక్రమ ప్రౌఢినేర్చియుఁ దొల్తఁ
బాడిపదక్రమ ప్రౌఢి నేర్చెఁ
బ్రాభాకరోన్ముఖ భావస్థుఁ డయ్యును
బ్రాభాకరోన్ముఖ భావమొందె
నియతిఁ బ్రత్యాహార నిపుణుఁ డయ్యును శబ్ద
నియతిఁ బ్రత్యాహార నిపుణుఁడయ్యె
స్మృతి పురాణార్థ సంగతు లెఱింగియు బహు
స్మృతి పురాణార్థ సంగతు లెఱింగె

తే. నిరత సంగీతరత గళోద్ధురతఁ గనియు
నిరత సంగీతరత గళోద్ధురతఁ గనియె
విమల విద్యాధికుండయ్యె విద్యలెల్లఁ
జదివె సామీరిలోకైక సంగ్రహేచ్ఛ.

(పుష్ప, తి. సమీరకు. వి. 2. ఆ. 217, 218, 219, 224. 225 : ప)

# కంకంటి పాపరాజు

రామాయణములోని యుత్తర కాండము నీకవి యుత్తర రామాయణ మనుపేర తెనిఁగించినాఁడు. ఈతఁడు 1575 - 1632 మధ్యమున నుండెను. ప్రళయ కావేరి యనఁబడెడి 'పులికాటు' అను ప్రదేశమున నీతఁడుద్యోగిసై యుండెను.

తన్ను అడవిలో విడువవచ్చు లక్ష్మణునిఁగూర్చి సీత పలికిన పలుకులు ఇందు గ్రహింపఁబడినవి.

## సీతాశోకము

చ. అడలకుమన్న, నీకు వసుధాధిపు నానతి దాఁటవచ్చునే
యిడుమలఁ జెందుమంచు విధి యీధర నన్నుసృజించియుండఁగాఁ
గడవఁగ నెవ్వరోపుదురు కానలకేఁగిననాఁడె యాపదల్
గడచితి నంచునుంటి నెఱుఁగన్ దుదినిట్లగునంచు నామదిన్

చ. ఎడవాక పూర్వజన్మముల నేమిథునంబులఁ బాయఁజేసి వ
రడలఁగ నవ్వుచుండితినొ యాయఘమూరకపోనె నాఁడు కా
అడవుల రామపాద జలజాప్తి వసించితి నేఁడు నాథుపొం
దెడసి యనాథనై యిచట నేగతిమేన భరింతుఁ బ్రాణముల్.

ఆ. ఏనుసాధ్వినసుచు నెల్లవారలునన్ను
సన్నుతింతురనుచు సంతసింతుఁ
గాని నడుమనిట్టి కటికనిందలు పుట్టి
యడవిఁ ద్రోచు రాముఁడనుచు నెఱుఁగ.

ఉ. ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిఁక రామచంద్రుఁడన్
గన్నులఁ జూడఁ గల్గదొకొ కల్గకయుండినఁ బ్రాణమేల పో
దన్న రఘుప్రవీరు చెవులారఁగ నింతయు దెల్పు నాదు మే
నున్నది చెంత గంగ మడుఁగున్నది యైనటులయ్యెడున్ మదిన్.

చ. ఎఱుఁగని మూఢులాడుకొను నెగ్గులకున్ భయమంది యప్పుడీ
కఱకు మనంబుతో విభుఁడు కానన సీమకుఁ బంచెఁగాక య
త్తెఱఁగొకసారి నన్బిలచి తెల్పి మనోవ్యథతీర్చి నన్ను నే
మీఱనని పంపఁడయ్యె నభిమానముఁ గూర్మియు నెందుఁచయెనో.

ఆ. వినియుఁ గనియుఁ బ్రజలు నను నిందసేసిన
యంతమాత్రమునకె యధిపుఁడులికి
యింత తెగువసేయ నిచ్చగించుట నాయ
భాగ్యమింతె యొకరిఁ బల్కనేల.

చ. వనముల కేలవచ్చితివి వల్లభునింబెడఁబాసి యొంటిగా
నని మునిపత్నులెల్ల గుమిగూడి యడుగన్ ధృతిమాలి వారికే
మని వివరింతు నింత విపదంబుధినే కరణిన్ దరింతునే
యనువున నీ ప్రతిక్షణ మహాయుగముల్ క్రమియింతు లక్ష్మణా.

—కం. పా. రాజు. ఉత్తర రామాయణము,
6 ఆ. 277, 279, 280, 281, 283, 285. 288, 289 పద్యములు.

# కవిచౌడప్ప

ఇతఁడు 16-17 శతాబ్దుల సంధికాలమున మట్ల అనంతభూపాలుని యాస్థానమున ఆశ్రితుఁడుగా నున్నట్లు తెలియుచున్నది. ఇతఁడు హాస్య కళాకుశలుఁడు. తనపేర వెలయించిన శతకమొకటి ప్రచారమున నున్నది. అందలి కొన్ని పద్యములు అసభ్యములుగా నున్నను హాస్య ప్రధానములయినవి చాలఁగలవు. అట్టివి కొన్ని యిచట నీయఁబడినవి.

## చమత్కార పద్యములు

క. విద్దెల మేలెఱుఁగని నరుఁ
డెద్దేగా గడ్డితినెడి దెద్దావళులం
దెద్దుకుఁ గొంత వివేకము
గద్దప్పా కుందవరపు కవిచౌడప్పా.

క. దినములలోపల నుత్తమ
దినమే తద్దినము నాఁటి తిండికి సమమే
దినములను వెదకి చూచినఁ
గనమప్పా కుందవరపు కవిచౌడప్పా,

క. ఇయ్యఁగ నిప్పించం గల
యయ్యలకేకానిమీస మందఱికేలా

రొయ్యకు లేదా మీసము
కయ్యమునకుఁ గుందవరపు కవిచౌడప్పా.

క. పెద్దనవలెఁ గృతి చెప్పినఁ
బెద్దనవలె నల్పకవిని బెద్దనవలెనా
యెద్దనవలె మొద్దనవలె
గ్రద్దనవలెఁ గుందవరపు కవిచౌడప్పా.

క. దొరవద్ద నెవఁడు చనవరి
నరులతనికిఁ బ్రియముసేయ న్యాయము ధరలో
హరి వాహనమని మ్రొక్కరె
గరుడుని మఱి కుందవరపు కవిచౌడప్పా,

---

# రఘునాథరాయలు

క్రీ. శ. 1630 - 1630 ప్రాంతమున తంజావూరి నేలిన నాయక రాజు. ఈతఁడు శూరుఁడు, విద్వాంసుఁడు, మహాకవి, కవిపోషకుఁడు, సంగీతమున మేటి.

ఈతఁడు రామాయణమును తెనుఁగున రచించెను. అందలి బోయవాఁడు క్రౌంచపక్షులలో నొకటిని చంపుటయు, ఆ కరుణామయ సన్నివేశమును గాంచిన వాల్మీకి మహర్షియొక్క శోకమే శ్లోకరూపము నందుటయు నిందు వర్ణింపఁబడినది.

## కవితావిర్భావము

సీ. కుఱుచగాఁ జుట్టిన కుఱుమాపు దట్టిపైఁ
గొడవలిలో దోఁటికూడఁ జెరివి
కొడిదిపూసలపేరు మెడనంటఁగాఁ గట్టి
బిగియొక్కఁ జెవిఁ బీలిబెండ్లువెట్టి
కొంగ యీఁకలు గొన్ని యంగుగాఁ దలఁజుట్టి
సంకుబల్కుడియంబు సందిట నిడి
గట్టి యల్లిక తట్టబట్టి చంకనమర్చి
పెలవిల్లు నమ్ములుఁ జేతఁబట్టి
చిక్కమురి గోలనలబిస జిగురుఁగండెఁ
బాదియును గొంచు బుడతరాఁ బాలనెమిలిఁ

గొఱుఁ గక్కెరఁ గల్లేటిఁ గారుకోడిఁ
గొక్కెరను బట్టుచును వచ్చె నొక్కయెఱుక.

వ. ఇట్లు చనుదెంచి జేగుఱు జిగిదేఱు నెట్టజేగుఱు గ్రుడ్డుల నీఱు
తాఱలు వారంజూచుచు నచట,

ఉ. ఒక్కమహీజ శాఖపయి నొక్కట వేడుకఁ గూడియుండి యొం
డొక్కటి రెక్కవిప్పుకొని యొప్పుగఁ గప్పుచు నొయ్యఁ
బల్కుచున్
ముక్కుల మేనుగీఱుచును మోమును మోమును జేర్చిమిక్కిలి
న్మక్కువనుండఁ గ్రౌంచమిధునంబుఁ గనుంగొని సంభ్రమంబునన్,

సీ. నుదుటిపై నొకవ్రేలు గదియించి క్రౌంచము
ల్నిలుచు చోటిదియని తెలిసితెలిసి
చంకబుట్టటువెట్టి సారెకు బుడుతనిఁ
జేరకు మనిసన్న చేసిచేసి
కిఱుకిఱుక్కనకుండఁ గిఱుకు మెట్టులు విడ్చి
పొదదారి మెల్లనఁ బొంచిపొంచి
మండివ్రేయుచు మ్రానిదండదండగ నిల్చి
సూటిగాఁ బలుమాఱు చూచిచూచి

కుఱచ తడవింట నొకమిట్టకోలఁ గూర్చి
నేర్పడర నూర్పడఁచి తెగనిండఁ దివిచి
కామమోహితమైన యాక్రౌంచ యుగము
నందు నొక్కటి నేసెఁబుళిందుఁ డపుడు.

గీ. ఇట్టులేయు నప్పుడేమనఁగా వచ్చు
మిట్టకోల బోరపట్టు దాఁకి
చెట్టుమీఁదినుండి చట్టుపల్ చెదర న
ప్పిట్ట పిట్టపిడుగు పృథివిఁబడియె.

క. పడిరోఁజు కొనుచు నెత్తురు
బుడబుడఁ గ్రక్కుచును బోరపొడవై యెగయూ
ర్పడరఁగఁ బోరలఁ దొడఁగె
న్వెడజెప్పం గన్నుగప్పి వేదన బలియన్.

ఉ. క్రౌంచము బోయచేతి బలగాయపు నొప్పిని రొప్పుసేఁత నా
క్రౌంచిగురించి దానిఁ గనికంపము నందుచుఁ గూయుకూఁతఁద
ల్క్రొత్తంయుగంబుఁ జూచి కలఁగబడుపక్షిగణంబు మ్రోఁత యొ
క్కించుకసేపు ముంచుకొనియెన్ వని నెల్లెడలందు నత్తఁడిన్.

క. కులకులఁ గూయుచు నిలపై
జలచలఁ జట్టుపలురాల సారెఁ బొరలుచున్
విలవిలఁ దన్నికొనెడు నల
పులుఁ గుంగని మౌనికరుణఁ బొగులుచుఁ బలికెన్,

క. మంచి తరుశాఖమీఁద స
మంచితగతిఁ గ్రౌంచిఁగూడి మదన క్రీడన్
మించిన క్రౌంచము నకటా
కొంచక యెట్లేసె బోయ కులకులఁ గూయన్.

వ. అని యవ్వాల్మీకిమునివరుం డాశబరుంగనుంగొనియిట్లనియె.

క. అక్కటా ! నిషాద ! రతిచే
మిక్కిలిఁ దమినెనయు క్రౌంచమిథునములో నీ
వొక్కటి బడవైచితి నీ
కెక్కడ నిలుకడ ఘటిల్ల దిఁక నెన్నఁటికిన్.

క. అని తిట్టి మౌనిచంద్రుఁడు
మనమున విస్మయముఁ జెంది మాటికి నిటుబో
యను దిట్ట శ్లోకమయ్యెన్
వినుమని శిష్యునకుఁ జెప్పి వేమఱుఁ జదివెన్,

వ. చదువ విని భరద్వాజుండును "మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః. యత్ క్రౌంచ మిథునాదేకమనధీఃకామమోహిత" మ్మను శ్లోకం బేకసంధన గ్రహించి తదర్థంబూహించి,

క. శోకమునఁ బలుకు పలుకే
శ్లోకంబై నిలిచెనిట్లు లోకోత్తరమై
శ్రీకరమై మృదుపదశో
భాకరమై చూడమిట్టి యద్భుత మెందున్.

—రఘునా. రా. 1. ఆ. 105-118 ప.

# చేమకూర వేంకటకవి

తంజావూరి నేలిన రఘునాధనాయకు నాస్థానమున 1600-1630 సంవత్సరముల నడుమ నీతఁడు గ్రంథరచనము చేసెను. ఈతఁడు వ్రాసిన విజయ విలాసము, అర్జునుని దేశాటనము మున్నగువానిని తెలుపునట్టి ప్రబంధము మిక్కిలి ప్రసిద్ధముగా నున్నది.

ఉలూచి యను నాగకన్య యర్జునుని చూచి మోహించి నాగ లోకమునకుఁ గొంపోయెను. అప్పుడర్జునుఁడులూచితో నాడిన మాటలు క్రింద నున్నవి.

## ఉలూచీ విజయులు

చ. అని మదిమెచ్చి యొచ్చెమొకయందును లేని మనోహరాంగముల్
గనుఁగొని యౌనెకావ్రతము గైగొని యుండెడినన్ను నేల దో
డ్కొని యిటఁ దెచ్చెనీవెడఁగుఁ గోమలి భూజగమేడ మారుతా
శన జగమేడ నెంత ఘన సాహస మింతులకంచు నెంచుచున్.

క. కాముకుఁడఁగాక వ్రతినై
భూమి ప్రదక్షిణముసేయఁ బోయెడివానిం
గామించి తోడితేఁ దగ
వామగువ, వివేక మించుకైనన్ వలదా.

ఉ. నావుడు మోమునన్ మొలక నవ్వొలయన్ వలిగబ్బిగుబ్బచన్
దీవికిఁగా నటింపక నటించు కవున్ గనుపింపఁ బల్కెరా
జీవదళాక్షియో రసిక శేఖర, యోజనరంజనైక లీ
లావహరూప, యోనుతగుణా, తగునాయిటులానతీయఁగన్.

క. నినుగీతి సాహితీ మో
హనవాణులు చెవులుపట్టి యాడింపంగాఁ
గనియుండి కాముకుఁడఁగా
నని వల్కిన నాకు నచ్చికొనె నృపాలా!

క. అతువిత విలాస రేఖా
కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువనలీలా
వతుల నలయించుటేనా
వ్రతమనఁగా నీకు రూపవంచిత మదనా!

క. అనుడు నుడురాజకులపా
వనుఁడు సమస్తమ్ము నెఱుఁగు వలఁతివిగద యీ
యనుచితము దగునె పరసతి
నెనయుట రాజులకు ధర్మమే యహిమమహిళా!

చ. అనవిని పాపపూప జవరాలెద లోపల పాపలేక యా
తని తెలిముద్దు నెమ్మొగముఁ దప్పక తేటమిటారి కల్కిచూ
పునఁ దనివారఁజూచి నృపపుంగవ, యన్నిటజాణ వూరకే
యనవల సంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్.

ఉ. కన్నియగాని వేతొకతెగాను మనోహరరూప, నీకునే
జన్నియవట్టియుంటి నెలజవ్వనమంతయు నేఁటిదాఁక నా

కన్నులయాన నావలపుఁ గస్తురి నామముతోడు నమ్మికా
దన్నను నీదుమోవి మధురామృతమానిట బాససేసెదన్.

తే. అనిన ఫణిజాతి వీవేను మనుజజాతి
నన్యజాతిఁ బ్రవర్తించు టర్హమగునె :
యేల యీకోర్కి యనిన రాచూలికనియెఁ
జిలువ చెలువంపుఁ బల్కులఁ జిలువచెలువ.

ఉ ఏమనఁబోయె దండగుల మెంచక నీవిటలారఁ దొల్లి శ్రీ
రాముకుమారుఁడైన కుశరాజు వరింపఁడె మాకుముద్వతిన్
కోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ బెండ్లియాడఁడే
నీమనసొక్కటే కరఁగ నేరదుగాని నృపాలకాగ్రణీ :

ఉ. ఈ కలహంసయాన నను నెక్కడికెక్కడినుంచి తెచ్చె నా
హా కడుదూర మిప్పుడని యక్కునఁ జేర్పక జంపుమాటలన్
వ్యాకుల పెట్టుటేల విరహాంబుధి ముంపక పోదునన్ జలం
బేకద నీకు మంచిదిఁక నీఁతకు మిక్కిలి లోఁతుగల్గునే :

చ. అని వచియించునప్పుడు ముఖాబ్జమునం బెడి విన్నఁబాటు చ
క్కని తెలిసోగకన్నుఁ గవఁగ్రమ్ముచు నుండెడి బాష్పముల్ గళం
బునఁ గనిపించు గద్గదిక ముప్పిరి గొన్వలవంత దెల్ప ని
ట్లను మదిలోఁ గరఁగి రసికాగ్రణి యాకరభోరుభోరునన్.

ఉ. చక్కెర బొమ్మ నావ్రతము చందముఁదెల్పితి నంతెకాక నీ
చక్కఁదనంబుగన్న నిముసంబయినన్నిలుపోప శక్యమే
యక్కునఁ జేర్పకంచు దయ నానతి యీఁ దలవంచె నంతలో
నెక్కడనుండివచ్చెఁ దరశేషణకున్ నునుసిగ్గు దొంతరల్.

—చేమ. వేం. కవి. విజయవిలాసము. (ప్ర.ఆ.87-103 మధ్య).

# విజయరాఘవుఁడు

1630—1673 వఱకును తంజావూరి నేలిన నాయకరాజు. విష్ణు భక్తుఁడు, శృంగార పురుషుఁడు, కవి, కవిపండిత పోషకుఁడు. ఈతని యాస్థానమునఁ గళాపోషణ బాగుగా జరిగినది రఘునాథాభ్యుదయము, విప్ర నారాయణ చరిత్రము మున్నగు గ్రంథము లనేకము లీతఁడు వ్రాసెను. యక్షగాన వాఙ్మయమున నీతనికి మక్కువ యెక్కువ. కవయిత్రులుగూడ నీతని యాస్థానమున నుండిరి. అందు రంగాజమ్మ ప్రధానస్థానము నొందినది. ఈతని యాస్థాన కవులలో నొకఁడగు పురుషోత్తమ దీక్షితుడు రచించిన తంజాపురాన్నదాన నాటకమున "ఏలిన వారు ఆనతిచ్చిన పదము"ను, విజయరాఘవుని గ్రంథము లన్నింటి యందును సాధారణముగా మొదటనుండు రాజగోపాల స్తోత్రమును ఇచట పొందుపఱుపఁబడినవి.

## పదము

అయిదువరా లిచ్చితి-వదియేమిరాయని యడిగితే
అయిదు వరాలవుకావా యని-యతివ చతురులు పలికేవు ॥౧॥
మాట నేర్పుల వాఁడుగదా-మన్నారు దేవుఁడు
బోఁటిదో యేమని-పొగడుదు నేను ॥౨॥
సరిపెన లిచ్చితిని యెంత-సరసుఁడ వంటేను
సరిపెన లియ్యవాయని-సకియ కందువ లాడెనే ॥౩

ఏలరా నన్నింత-యేఁతురాయంచేను
ఏలరా నన్నునేది-యింతినీనై జమనెనె ॥౪॥
—పురుషోత్తమ దీక్షితుఁడు-తంజాపురాన్నదాన మహానాటకము.

## కైమోడ్పు :—

సీ. భోజకన్యా ముఖాంభోజ రాజమరాళ !
సత్యాఘనస్తనస్తబక భృంగ !
జాంబవతీ విలోచన చకోర శశాంక !
మిత్ర విందాతటిన్మేఘరూప !
భద్రావశావశ భద్ర దంతావళ !
వరసుదంతా మనోవన మృగేంద్ర :
లక్షణారూప కలాపినీ పర్జన్య !
భానుసుతాలతా పారిజాత !

గీ. షోడశస్త్రీ సహస్ర చక్షుః ప్రసార
హారసార మసార మోహన శరీర !
విజయరాఘవ భూపాల భజనలోల !
కేలు మోడ్చెద రాజగోపాల ! నీకు

—విజయ రాఘవ.

# రంగాజమ్మ

తంజావూరు రాజధానిగా పరిపాలించిన విజయరాఘవ నాయకుని ధర్మపత్నినని యీమె తను వ్రాసిన మన్నారు దాసవిలాసమను యక్షగానమున చెప్పుకొన్నది. ఆయన సభలో నీమెకుఁ గనకాభిషేకము చేసిరి. ఈమె యాతని భోగవనితయగు నభిప్రాయము గూడ నున్నది. ఇంటి పేరు పసుపులేటివారు. సంగీత సాహిత్యముల పేరందిన ఈమెమన్నారు దాస విలాసమును ప్రబంధముగాఁ గూడ రచించినది. వేశ్యావర్ణనమును గూర్చిన యీ దిగువ పద్యములు ఆ ప్రబంధములోనివి.

కాలము 1633 - 1673.

## వేశ్యావర్ణన

చ. మనసిజధన్వి జీర్ణకుసుమ స్వశరాసన బాణముల్ రయం
బనఁబడవైచి యన్నగర ప్రోడమిటారుల తీరుమీఱఁగా
కనుబొమవింట్లు చూపులను గట్టిలకోరుల పట్టిలోకముల్
మునుకొనిగెల్చి యెంతయును మోదముతో విలసిల్ల నచ్చటన్.

చ. అలపురి లోపలంబరఁగు నంబురుహాక్షుల యొప్పుమీఱునా
గళముల నాభిజంఘలను గన్బొమలన్ మెఱుఁగారు నోరులన్
గెలువఁదలంచి శారికిని నిత్యము సేవ యొనర్చుచున్నవా
జలజము చక్రమున్ గదయు శార్ఙ్గము నందకముందలంపగన్.

ఉ. ఈ పదునాల్గు లోకముల నెన్నికలెక్క జయింపఁ జాలుబా
హాపటి మాధ్యుఁడౌ మరున కాశర పంచకమంచు నెంచితా
నేపున లోకకర్త సృజియించిన బాణకదంబకంబునా
నా పురివారకాంతుల కటాక్షపరంపర నింపునింపులన్.

ఉ. కన్నుల గండుమీలు, తొలుకాలు మెఱుంగులు మేనువెయ్యేడం
గన్నపికాపును లలకంబలు చొక్కపు టింద్రనీలముల్
చన్నులు కుంభికుంభములు సారసముల్ పదముల్ దలంపఁగా
నన్నగరంబు కామినుల కన్యకధూటులు సాటివత్తురే!

రంగాజమ్మ—తు. దా. ని. పీఠిక.

---

# క్షేత్రయ్య

ఈతఁడు గేయకవిత్వము వ్రాసి పేరొందినవాఁడు. 'మువ్వ గోపాల' యను ముద్రతోనున్న ఈతని పదములు చాల ప్రసిద్ధములు. శృంగార రసప్రధానములు. భక్తిని గూడియున్నవి,

రాజస్థానముల సన్మానము లందినవాఁడు. ఈతఁడు 1650 సమీప మున నుండినవాఁడు.

## పదము

## మోహనరుంప

మగువ తనకేళికా - మందిరము వెడలెన్
వగకాడ మాకంచి - వరద తెల్లవారె ననుచు ॥మగువ॥

విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను
కడు చిక్కుబడి పెనగు - కంటసరితోను
నిడుద కన్నుల దేరు - నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున - దడబడెడునడతోను ॥మగువ॥

సొగసి సొగయని వలపు - సొలపు చూపులతోను
వగవగల ఘనసార - వాసనలతోను
జిగిమించు కెమ్మోవి - చిరుగు కెంపులతోను
నగము కుచముల విదియ - చందురులతోను ॥మగువ॥

తరితీపు పేయు సమ - సురతి బడలికతోను
జరుతపావడ చెరగు - జార్వైటతోను
ఇరుగడల కైదండ - విచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వ గో - పాల తెల్లవారెననుచు ॥మగువ॥

# సవరము చిననారాయణ

ఈతఁడు వ్రాసిన కువలయాశ్వ చరిత్రము అను ప్రబంధము నుండి నాఁటి రాజసభా స్వరూపమును గోచరింపఁజేయు నొక వర్ణన పద్యము క్రింద నున్నది.

—ఈతని కాలము 16వ శతాబ్దము.

## రాజసభ

సీ. చెలి దండఁజేరి నిల్చిన వ్రాయసమువారి
ముదలకమ్మల కొప్పములు లిఖించి
దిక్కులనుండి యేతెంచు మన్నీల మం
త్రులతోడ నుచితంపుఁ బలుకు పలికి
సమయోచితముగ హాస్యము లొనర్చు విదూష
కుల దిక్కు మొలక నవ్వొలయఁజూచి
యవసరంబుల వారలవ ధారనుచుఁ దెల్పఁ
బొడగని వారికింపులు వేలార్చి

గీ. సత్కవీంద్రులు రచియించి చదువు పద్య
సమితియందొరపారలు చక్కదిద్ది
ప్రౌఢి గనుపింపఁజేయు భూపాల కొలువు
ప్రజల కవ్వేదఁ గన్నుల పండువయ్యె.

—సవరం చిననారాయణ నాయక-కువలయాశ్వ. చ. ఆ. 2. ప. 9.

# కాకునూరి అప్పకవి

ఆంధ్రలోకమున నీతనికిఁగల ప్రశస్తి యీతని లక్షణ నిర్మాణమువలనఁ గలిగినది గాని కవిత్వమువలనఁ గాదు. కాని, లక్షణకర్తయై కవి గూడ నయిన యీతఁడు కవిత్వమును గూర్చి వ్రాసిన పద్యములు చదువఁదగినవి.

ఈతఁడు 17 వ శతాబ్ది నడుమ నుండినవాఁడు.

## కవితాప్రశంస

గీ. విబుధ లోకంబు కవితైన విద్యయనుచుఁ
జదువు వచనార్థమునను సంశయము గలదె!
విద్యలకునెల్ల నుత్తమ విద్య కవిత
దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట.

క. ధారుణి నాకుజ మారుతి
పాదాచర్యులు చరించు భావుకశిష్టా
చారమవశ్యకమని కవి
తారతమతులైరి కాళిదాస ప్రముఖుల్.

మ. జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చుల్ పూజ్యుఁడాసీమఁ బా
సినఁ దాగవ్వయుఁ జేయఁడన్ని కడలన్ శ్రేష్ఠుండువిద్వాంసుఁ డా
యనకన్నంగవి మేటి యౌసుకవితాయద్యస్తి రాజ్యేన కి
మ్మను వాక్యంబు నిజంబు దీనిఁగని కావ్యంబుల్ రచింపందగున్.

క. కవితయుఁ గవితయుఁ దానై
చనుదెంచుట గలిగెనేని సరసంబగు ధా
త్రిని బల్మికోలు గావిం
చిన విరసంబగు నటంచుఁ జెప్పిరి విబుధుల్.

క. చందోలంకారాదుల
యందలి పాల్లెల్లఁ దుదిని వ్యర్థముగావే
సుందరమగు వాక్యంబుల
పొందెఱిఁగి రచించు బుద్ధిపుట్టకయున్నన్.

క. విరచించుశక్తి పుట్టని
పురుషుని చదువుల ప్రకాశములగావు వసూ
ధర దీపరహిత సదనో
తరమున రేయిఁబడియున్న ద్రవ్యముల క్రియన్.

గీ. ఆశుధ్ధారా కవిత్వంబులందు శయ్య
లుపమలుత్ప్రేక్షలను లేకయుండుఁ గాన
నెంత యోచించినను బద్యమంత సార
వంతమగుఁ గాన నిలుకడవలయుఁ గృతికి.

—అప్పక. ఆ 1. 53-59 ప.

# ధరణిదేవుల రామయమంత్రి

ఈతఁడు వ్రాసిన దశావతార చరిత్రనుంచి స్త్రీ ప్రాముఖ్యమును జెప్పు పద్య మొక్కటి ఉదాహరింపఁబడినది.

ఈతఁడు 17 వ శతాబ్దము తుదినున్నవాఁడు.

## స్త్రీ ప్రాముఖ్యము

సీ. సంసార సాగరక్షయ దుఃఖవారాశిఁ
దరియింపఁగా జేయు తరణి తరుణి
హృదయంగ మనస్స్ఫూర్తి నెపుడు నామోదంబుఁ
గలిగించు తావిచెంగలువ చెలువ
కామిత ఫలములు ఘటియంచి వేలుపు
దేఁడు పెంచిన చెట్టు రెమ్మకొమ్మ
కందొవల్ నిత్యవికాస మొందింపఁగా
మంచిపున్నమ చందమామ రామ

గీ. సదన మణిమయ దీపికాజ్వాలబాల
వల్లభ మనోమదావళి వారినోరి
శుభపరంపర వర్షించు సోనచాన
పృథల ధర్మార్థ మణిగణ పేటిబోఁటి.

ధరణిదేవుల రామయమంత్రి - దశావతార చరిత్ర

# వెలిదిండ్ల వెంకటపతి

ఈతఁడు 1700 సంవత్సర ప్రాంతమువాఁడు. రాధా మాధవ సంవాదమను పేరుగలిగి తెలుఁగు పలుకుబడి పొలుపుతో వెలయు నొక ప్రబంధము నీతఁడు వ్రాసియున్నాఁడు.

రాధ మాధవుని ప్రియురాలు. వారి ప్రసంగమిందు వర్ణింప బడినది.

## రాధామాధవుల ప్రసంగము

ఉ. ఇంపుఘటింప నొక్కపడుకిల్లు గనుంగొని యందురాధ యం
దంపు పెలంగువీనుల వినంబడఁదావినట్లు చేరినున్
గెంపుల చెక్కడంపుఁ బని గల్గొను బంగరుపావలెక్కి ని
ద్దంపు మెఱుంగుఁ జాయజముదాళి కరంబునఁదల్పమీటినన్.

గీ. అమ్మనేఁజెల్ల యిది యెవ్వరనఁగ రాధ
యెటకుఁబోవకుఁ మిందెవ్వఁడేల వచ్చు
నేను నీ యల్లుఁడనటంచు నెనరుదోఁపఁ
బాదములమీఁద వ్రాలె గోపాలమూర్తి

క. లేవయ్య దొడ్డవాఁడవు
నీవని తానవలితేఁగి నిన్నేమనుచుం
దీవింపః వింద మునుపే
గోవిందుఁడు నిత్య పెండ్లికొడుకను మాటల్.

గీ. పాన్పుమీఁదను గూర్చుండి పలుకవయ్య
మీరలును మహారాజులై నాదుగాన
నే నమస్కృతి సేసెదనిదిగో యనుచు
మ్రొక్కి తాఁబాన్పుదిగువ నింపునవసించి

క. వెలఁగుపడి యూరకుండెడు
హరిఁగూరిచి రాధపలికె నానాఁటివలెన్
మురిపము గలదో లేదో
యరయుదమని వచ్చినావో? యరయుము రాధన్.

ఉ. ఊరకయేమియుం బలకకుండెద నంచుదిటాననున్న, శృం
గారగుణావతంస, నినుఁగన్గొని యూరకయుండనేరదీ
నారొక పెండ్లికైనను ననుంబిలిపించితె? చూడనెవ్వరున్
లేరనికాదు నీకెపుడు నేదయదానను గాన వేఁడితిన్,

క. గోపాలక మాటాడక
కోపంబున నుండ నెంచుకొంటిని మొదలన్
నాపగ్గె చెల్లఁబోదని
కోపము నేనే శమించుకొంటిని బిదపన్.

ఉ. వేడుక కర్తనంచు రతివింతలనిన్ భ్రమియింపఁ జూతునో,
తోడివహింతునో భువనమోహినినేనని, కాక యేలపెం
డ్లాడితివంచు బాధ్యతను నాడుదునో, యిదియేమి యెందునుం
గూడ నిదాననైచనవు గోరెద, నెవ్వతెనంచు దూఱెదన్.

ఉ, మానుషమెంచితైన, నొక మంచితనానకునైన నీదు
పుణ్యానకు మాటలాడెదవు నాతరమా నినుబల్మిఁజేసి నే

స్తానకుఁ బిల్వ? నీఘనతచాలదె రాధకుఁ గాక కాఁకచే
నే నొకటాడనేఁటి; కది నీకు నసహ్యముదోఁచ నేటికిన్,

ఉ, దోసము కృష్ణ కృష్ణ! నినుదూఱిన; నా నొసలందు ధాతమున్
వ్రాసిన వ్రాఁతగాదనుచు వ్రాయఁగనీతరమౌనె? నీవు దా
వేసటలేక యేరికని వేడుకచేసెదు పైనిపైని నా
సౌసలమాకు మేమెపయినాడిన నిన్నన నేరమున్నదే,

—(వెలిదిండ్ల వెంకటపతి, రాధామాధవ సంవాదము- 87-90. పు)

# శేషాచలపతి

యక్షగానములను పేర మిక్కిలి వ్యాప్తిలోనున్న దేశీయరూపకములు చదువుటకును బ్రదర్శించుటకును ఇంపుగానుండి తెనుఁగువాఙ్మయమున నొక ప్రత్యేకతను బొందియున్నవి. అందలి వెన్నెలపదములు, అర్ధచంద్రికలు, ఏలలు మొదలగునవి యింపైనా జాతీయ రచనలు.

శేషాచలపతి శాహరాజవిలాసమను యక్షగానమును రచించెను. ఈ గ్రంథము 1684–1712 సంవత్సరముల నడుమ రచియింపఁబడి యుండును.

శాహరాజును (తంజావూరు నేలిన మహారాష్ట్రరాజులలో రెండవ వాఁడు) బొందదలచిన నాయిక తన విరహమును ఈ గీతములోఁ దెలుపుకొనుచున్నది.

## వెన్నెలపదము

తాళఁజాలనేల - వెన్నెలారో- నేను ॥

బాలమేలు మేలీవేళ - బాలి చాలమేలుదూలె - వెన్నెలారో॥
నేఁటికిఁ బ్రాణేసుఁడెదుట - మాటికి నిల్చిన యట్లాయె - ॥వెన్నెలారో॥
యింక నేటికిఁ దామసమునిను - బోఁటికి నేవేడెదనె ॥వెన్నె॥
చొక్కమా ప్రాణేశుతోడ - నిక్కమగు నావలపుదెలపు ॥వెన్నెల॥
నా చక్కని గబ్బిగుబ్బలు - చక్కని సామినికూర్తు ॥వెన్నెలారో॥
నెవ్వగలంతంత తాళ - నివ్వగలంత తెలుపవె - వెన్నెలారో - మొల్ల

పువ్వుల పట్టులజాడె - నవ్వుల మాటలవాఁడె ॥వెన్నెలారో॥
వీడెనేపోఁకముడి యీ - జాడనే నావిభునిఁదలచఁక ॥వెన్నెలారో॥
హా కాడనేమారబాణము వీడెనే ధైర్యమంతంత ॥వెన్నెలారో॥
మోహముచే నిచ్చలోను - త్సాహముతోచదాయె - ॥వెన్నెలారో॥
యా మాహేంద్రభోగము గల్గు శాహేంద్రునిఁ దోకితేనె ॥వెన్నెలారో॥

—(శేషాచలపతి - శాహరాజవిలాసము)

---

# శేషము వెంకటపతి

ఈతఁడు 1704 - 1730 లో విజయరంగ చొక్కనాధుని కాలమున మధురలో నుండినట్లూహింపఁ బడినది.

ఈతని తారాశశాంకవిజయము నందలి కథ, చంద్రుడు బృహస్పతి భార్యయగు తారను తీసికొనిపోయిన విషయము పరకీయశృంగారము.

ఇందు తారచంద్రుని ప్రలోభింపఁజేయఁగా నాతఁడు తిరస్కరించు ఘట్టము వర్ణింపఁబడినది,

## శశాంకుని నీతి

మ, ఇదియే మిచ్చటికేల వచ్చితివి? నీ కింటంబనుల్లేవే? యి
ప్పుడు పోపో పతి యూరలేనియెడ నీ పల్పోకశృంగారముల్
సుదతుల్ సేయుదురే? రహస్యమున నిచ్చోఁజేరి నాచెంత నుం
డెద విట్లుండిన లోకులూరకయ సందేహింపరే చూచినన్,

క. అనఁ జిఱునవ్వు మొగంబున
దనరఁజకచ్చకిత కర్ణతాటంకరుచుల్
దనుకన్ మకమక చినుకన్
కనకాంగిహొయల్ చెలంగఁగా నిట్లనియెన్.

ఉ. వచ్చిననేమి రావలసివచ్చితి నే పనియున్నదింట నీ
విచ్చట నుండఁగా మనసుకింపగు సొమ్ములుఁ బెట్టినంత నే
యొచ్చెములేని నీ సరసనుండుట కేమియు నోచనైతినా
యెచ్చట నున్ననేమి మనకేమిటి కెవ్వరు సంశయింపఁగన్.

ఉ. కాకయె సంశయించినను గాదననేటికిఁ గంతుబారికిన్
లోకువగానివారు ధరలోఁ గలరే యిపుడిన్నినాళ్లకై
చేకుఱె నెలంటిపాటిచటఁ జేసినపుణ్యముచేత నింకనన్
గాఁకలఁబెట్టకే విను ముఖాముఖిఁ బల్కెద దాఁచనేటికిన్.

ఉ. నీ నెఱనీటు నీ సొగసు నీ రసికత్వము నీ విలాసమున్
నీ నవమోహనాకృతియు నీ యెలప్రాయముఁజూచి చూచియున్
మానని ప్రేమనేచి యభిమానముచేఁ దమిదాఁచి యిన్నినా
ళ్లేను మనోజుబారికి సహించితిఁ బొంచితి మోహముంచితిన్.

సీ. కమ్మని నీ ముద్దు కెమ్మోవిగని యాస
మీఱంగ గ్రుక్కిళ్లు మ్రింగిమ్రింగి
యొఱపైన నీదు పేరురము చందముచూచి
గుచ్చచన్నుల బయల్ గ్రుమ్మిక్రుమ్మి
యింపైన నీ చెక్కు వీక్షించి ముద్దిడ
నూరకే నా తెర యొగ్గి యొగ్గి
చూడఁజూడఁగ వింతసొబగైన నినుఁగాంచి
తహతహపైఁబడఁ దలఁచి తలఁచి

గీ. ఎపుడు పైకొందు ముచ్చట వెపుడుగందు
నెపుడొదవుఁబొందు విరహాగ్ని యెపుడు డిందు

ననుచు నేనుందు నేఁటికి నబ్బెసందు
లీలఁ బెంపొందురతులఁ దేలింపుమిందు,

చ. అనవిని గుండెజల్లనఁగ నచ్చెరుపాటును రిచ్చపాటు నె
క్కొనఁ గరుపాటునుంగదురఁ గొండొకసేపటు లూరకుండి నె
మ్మనమునఁ దెల్విఁబెట్టి మటుమాయల మారునిదిట్టి యక్కటా
వనితల భావముల్ దెలియవచ్చునెయంచుఁదలంచి యిట్లనున్,

క. తగునే నీ కిది యెంతటి
తెగువే యీసుద్దొకింత తెలిసిన జగతి
న్నగ వారడి యపయశమున్
మగువా, చేపట్టినట్టి మగవానికగున్

ఉ. ఇంతిరొపాలవంటికుల మీవు జనించిన దొటనెన్నఁగా
నెంతయు వన్నెవాసిగను నింటనుజొచ్చిన దేమిచెప్పు కం
చంతటి కాపురంబు సతుకాననఁజేసెదుజాతి నీతి యొ
క్కింత దలంప కిప్పునికి నేటికిఁ నేఁటికి గ్రొత్తగాఁ జోరన్,

ఉ, ఓర్వదు బందుజాల మడకొత్తున నొత్తును మామగారిదే
పర్వినమాత్రపంట పగఁబట్టును బావ మగండటంటి మా
దుర్వహరోష భీషణతఁ దోడనెచెంపఁగఁజూచుఁ గావునన్
సర్వవిధంబులన్ సతికి జారసమాగమకాంక్ష చెల్లనే ?

చ. రమణిరొ, యేటికి ట్లిహపరంబులకు న్వెలియైన యట్టియా
క్రమమున విన్నపాటు తమకంబును దిట్టతనంబు యోరమున్
బొమముడిపాటు జంకెనయుఁ బూనికయున్ మురిపెంబు మోడిపం
తము చిఱునవ్వు దోఁప వనితామణి కన్గొని వానికిట్లనున్.

శా. కానీరా యిటువంటి సీతము లనేకంబుల్లినుంబోలి వి
న్నానేను న్నినువంటి నీతిపరులున్నారీ కుచాభోగభో
గానం దైతరసంబె బ్రహ్మమని మోహాయత్తతన్ మౌనమున్
ధ్యానంబున్ జపముందపంబడిగి యుండంజూడమే యిద్దరన్.

క. గణ్యత నేమైనసరే
ప్రాణ్యవనముఁ జేయవలయు రసికసుత ప్రా
వీణ్యా, "పరోపకారః
పుణ్యాయ" యటన్న వచనమున్ వినలేదా

ఉ. ఎంచఁగరాని మోహమున నేనిటు పిన్నటనాఁటి నుండియున్
బెంచితిఁ బెద్దచేసితిని బేర్మిగఁ బ్రాయము వచ్చినంతనే
యెంచక మాటలాడె దిపుడిన్ని ప్రియోక్తుల కిమ్ముపుట్టెఁగా
మంచిది నిన్ను గూడుటకె మాకు స్వతంత్రము లేకపోయెనే!

ఉ. నావుడు నాతఁడేమియు ననన్ మనసొగ్గక మోహమెట్టిదో
యేవగఁ ద్రోసినన్ విడువదీ వగలాడి బలోయుక్త మా
యీవితమందు నిట్లనె సురేంద్రునకుం గురుపత్నివై జగ
త్పావన కీర్తి గాంచితివి పాడియె నీ కిటువంటి పోడుముల్.

క. కోపము కలదిది నీవీ
పాపమునకుఁ జొచ్చినం బ్రపంచంబున నిం
కేపొలఁతి మగని యొద్దన్
గాపుర మొనరించు వలదు కాపథ మతివా.

తారా చ, ఆ. 3. ప. 58 - 77

# ముద్దుపళని

1739 - 1763 సంవత్సరముల నడుమ తంజాపూరు నేలిన మహారాష్ట్ర ప్రభువగు ప్రతాపసింహుని యాస్థానమందుండి "రాధికాసాంత్వనము" అన శృంగార ప్రబంధమును రచించినది. అంతియగాక, ద్రవిడభాషలో ఆండాళ్ (గోదాదేవి) రచించిన పాశురముల సప్తపదులుగాఁ దెనిఁగించినది. వానిలో రెండు ఇచట నీయఁబడినవి. రాధికాసాత్వనమందు కాంతావర్ణనముచేయు నొక పదకముగూడ నుదహరింపఁబడినది.

## పాశురములు

### మార్గళిత్తింగళ్

శ్రీనివాసగురునిఁదలచి చిత్తముననుముద్దుపళని
పూనిచేయు ద్రవిడపాటలోనిభావమై
చెలఁగి తెలియవాణి తనదు జిహ్వకొనను నిలిచి యిటుల
పలికెఁదిరుప్పావు సప్తపది పదంబుగా -
మాసములకు నెల్ల మంచి మార్గశిరము పర్వమహహ
యాసగలిగినట్టి చెలులు డాసిరారే !
మంచి వగల మించి కులమునెంచి యవతరించినట్టి
చంచలాక్షులెల్లఁగూడఁ జనగరారే !

న్యాయశాలివైన నందనందనుండు తోయజాక్షి !
శ్రీయశోదకనిన సింహశిశువుకాఁడచే
నల్లమబ్బుచాయమేనిఁ దెల్లజేయుడాలుగల్గు
పుల్లపుండరీకనయన పురుషవర్యుఁడే !
కీరవాణులారా ! హరిని గోరిచేరి తేరిసకల
పూరుషార్ధములను దృప్తి పొందరారే ?

## తూ మ ణి మా డ త్తు

వాఁడెవచ్చి పిలువలేచి వత్తమనుచుఁ బండుకొన్న
చేడె నిదురలేపఁగాను జెలులు వచ్చిరే !
మణి విచిత్రసౌధమందు మంగళార్థమైన దీప
కణిక లుల్లసిల్లఁ బొగలు గమ్మమనఁగనే !
కులుకుతళుకు శయ్యసద్రఁ గూరినట్టి మేనమామ
కూర్మిబిడ్డ ! గడియ తలుపుగొలుసు మలుపవే !
అత్త ! పూలగుత్తి నీదు ముత్తియంబు బిడ్డమెల్ల
నొత్తిగించి నిదురలేవ నెత్తరాదటో !
మూగచెవుడు గలదో లేక రాఁగనీక మత్తునిదుర
సాఁగితూఁగ నెవరు మందుచల్లినారలో
మాధవుండు మాయలాఁడు వేధకైన బోధకేని
గాథవాని వెయివిథాల గణన చేతుమే !
అమ్మ ! తోడికొమ్మలిరుగొ, లెమ్మనంగదమ్మ ముద్దు
గుమ్మనీదు తళుకుఁ గులుకుబొమ్మ నిప్పుడే !
(ముద్దుపళది - సప్తపరి - రాథికా సాంత్వనము)

# కాంతావర్ణనము

సీ. మగతీఁటి గరులకు మగువ ముంగురులకు
నేనాఁటి నేస్తమో యెఱుఁగరాదు
ఇలఁ జంద్రుగోమున కింతి నెమ్మోమున
కేమి దాంపత్యమో యెఱుఁగరాదు
కపురంపుఁ దావికిఁ గలికి నెమ్మోవికి
నే యనుకూలమో యెఱుఁగరాదు
బంగారు గిండ్లకుఁ బడఁతి పాలిండ్లకు
నేయనుబంధమో యెఱుఁగరాదు

గీ. కళకు మగమీలు తెలిరాలు కనులరాలు
కాంతి జిగిచూపు మదుచేతి కలువతూపు
నతివమైమించు తళతళ యనెడుమించు
నొక్కచోటనే పుట్టని దొకటె కొదవ.

రాధికాసాం. ఆ. 3.

# కూచిమంచి తిమ్మకవి

ఇతఁడు 1690 - 1750 సంవత్సరములనుండి యనేక గ్రంథములు రచించినవాఁడు. ఈతని రసికజన మనోభిరామమను ప్రబంధములోని నాయికావర్ణనమునందలి పద్యమొక్కటి యిచట నీయఁబడినది.

## నాయికావర్ణనము

సీ. పలుకులు నేర్చిన తళుకుఁ బుత్తడి బొమ్మ
జగతికి డిగ్గిన చంద్రరేఖ
నిలుకడఁ గాంచిన తొలకరి క్రొమ్మించు
తావి చేకుఱిన నెత్తమ్మికెంపు
నెన్నడ పొదవిన కన్నెమామిడి గున్న
తనుపూని మెలఁగు కెందమ్మికొలను
నగవుఁ జూపలవడ్డ సొగసు క్రొన్ననచెండు
చేష్టలబ్బి మెలంగు చిత్రరేఖ

తే. గావలయు నియ్యబల దీని గాఢకాంతి
రూపలావణ్య శుభవైఖరులు గరంబు
నమ్మహారాజునకుఁ దెల్పి యతిరయంబు
తోడుకొని వత్తునని వేడ్కతోడ మరలె.

రసి. మ. రామము. 2 - 69

# గోగులపాటి కూర్మనాథకవి

ఈతఁడు 18వ శతాబ్దము నడుమ సింహాచలక్షేత్రమున నుద్యోగిగానుండెను. ఇతఁడు రచించిన మృత్యంజయ విలాసమను యక్షగానమునుండి పార్వతి తపశ్శందర్భము నందలి ఋతువర్ణమునుగూర్చిన పద్యములు కొన్ని యచటఁ గూర్చినవి.

## ఋతువర్ణనము

### వర్షర్తువు

సీ. స్తనితారవార్భటీ జనతాతిభయవధూ
జనతాస్వయంగ్రాహ వినుతజనము
కరకాంతధారా నికర కాంతమౌక్తికా
కరకాయమాన భాకారఘనము
ఆపనీధరస్థల న్నవనీరబహుఝరీ
జవనాపతద్దరీ భువనవనము
విపులావియన్మధ్య విపులాభపరిపూర్ణ
చపలప్రభీతాహి చపలమనము
అఖిల సస్యావనము మయూరౌఘజీవ
ధనము పాంథమనోవిభేదనము చపల
తనము భూదేవతకుఁ జల్లఁదనమునగుచుఁ
బ్రకట గతిమించెనంత వార్షికపుదినము.

## హేమంతము

సీ. పటుపైనమంచుతుంపరలకుఁ బుట్టినయిల్లు
కమలపాళిక మారక గ్రహంబు
చలువ పన్నీటి కుచ్చాటన మంత్రంబు
బీదలవణఁకింపఁ బెద్దమేకము
చెలువల కుచదుర్గములకుఁ బిరికిబంటు
పృథువస్త్ర వితతికిఁ దృప్తికరము
మేడతల్పులుదీయఁ గూడని ముట్టడి
యినహరుల్ పరులెత్తు వెనకతరిటి

ఓష్ఠకంప మృషామంత్ర ముచ్చరించి
సమిధల నలంబు నందుంచి జ్వాలసేయు
తనుల దంపతు లెడవాయకునికి జేసి
క్రతువిధి యనంగ హేమంత ఋతువుదనరె.

## గ్రీష్మము

సీ. భీషణప్రభ ప్రజపీడ బెట్టుటచేసి
రవి మిత్రభావంబ రాజుఁజేరె
జనులకుఁ గాల్నిల్వ శక్యంబుగాకున్కి
ధరణి కనంతాఖ్య దట్టమయ్యె
తనునార్పు జలనామ ధరము కాననయేమొ
దహియించె వనముల దావవహ్ని
గిరినిర్ఝరంబ వింకినకాట తద్గత
శైత్యముల్వనితల చంటదాఁగెఁ

బవలు జళకేళి, వెన్నెల బయలరాత్రి
హిమజలార్ద్ర పటీర పంకములచేతఁ
గాలమొకరీతి భోగులు గడుపుచుండ
భీష్మగతితోడ నరుదెంచె గ్రీష్మఋతువు.

గోగులపాటి కూర్మనాధకవి - మృత్యుంజయ విలాసము.

---

# అడిదము సూరకవి

1759 - 1794 సంవత్సరముల నడుమ విజయనగరమున పూస పాటి విజయరామరాజుగారి యాస్థానమున కవిగా నుండెను.

ఈతఁడు వ్రాసిన రామలింగేశ శతకమున లౌకికములైన నీతులు హృదయంగమముగాఁ దెలుపఁబడినది.

## రామలింగేశ సంప్రార్థనము

సీ. మాన్యంబులీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యముల్ సెఱుప సామంతులంద
ఱెండిన యూళ్ళగోఁ డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
బండిన యూళ్లెన్నఁ బ్రౌఢులంద
ఱితఁడు పేదయటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
గలవాని సిరియెంచఁ గలరుచాలఁ
దనయాలి చీఁకటి తప్పెన్నఁ డెవ్వఁడుఁ
బెఱకాంత ఱంకెన్నఁ బెద్దలంద

తే. రిట్టిదుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెఁగాక దుర్ణయుల ననఁగ
నేమిపని యున్నయది సత్కవీంద్రులకును
రామలింగేశ, రామచంద్రపురవాస!

సీ. కోఁతికి జల్తారు కుళ్ళాయి యేటికి
విరజాజి పూదండ విధవ కేల
ముక్కిడి తొత్తుకు ముత్యంబు నత్తేల
యద్దమేటికిని జాత్యంధునకును
మాచకమ్మకునేల మౌక్తికహారంబు
క్రూరచిత్తునకు సదోష్ఠియేల
అంకుఁబోతునకు సద్వ్రతనిష్ఠ లేటికి
వావి యేమిటికి దుర్వర్తునకు

తే. మాట నిలకడ సుంకర మోటకేల
చెవిటివానికి సత్కథాశ్రవణ మేల
సరసకవితారసంబు ముష్కరున కేల
రామ........................వాస

సీ. పాత్రసంయోజన ప్రతిభగల్గినఁగాని
ధన మొసంగినఁగాఁడు దానశాలి
కర్తవ్యమున వివేకంబు గల్గినఁగాని
గడ్డంబునరసినఁ గాఁడు పెద్ద
సముచితాచారంబు సంగ్రహించినఁగాని
చదువమాత్ర మెకాఁడు సద్ద్విజుండు
న్యాయమార్గంబున నడవనేర్చినఁగాని
పదుగురు సేవింపఁబ్రభువుగాఁడు

తే. విమలతరమైన సరసవివేకబుద్ధి
శిష్యసమితికి బోధఁజేసినను గాని
దేశికుఁడుకాఁడు మంత్రోపదేశమాత్ర
రామ........................వాస

(రామలింగేశశతకము - 4, 33, 64 వ)

# ఏనుఁగు లక్ష్మణకవి

సంస్కృతములో భర్తృహరిచే రచింపబఁడిన నీతి శృంగార వైరాగ్యములను గూర్చిన సుమారు మున్నూరు శ్లోకములు సుభాషిత త్రిశతి యనుపేరఁ బ్రసిద్ధములైయున్నవి. ఈ శ్లోకములను బాలసరస్వతి, ఏనుఁగు లక్ష్మణకవి, పుష్పగిరితిమ్మయ అనువారు వేర్వేరుగాఁ దెనిఁగించిరి. వారిలో లక్ష్మణకవి యనువాదము తక్కినవానికన్న మిన్నయై బహుజనాదరణ పాత్రమైనది. ఈ మూఁడు శతకములనుండియు నక్కడక్కడి కొన్ని పద్యములిట నుదాహరింపఁబడినవి.

## సుభాషితము

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖులమనసు రంజింపరాదు.

ఉ. భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁజేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

తే. కుసుమ గుచ్ఛంబునకుఁ బోలెఁ బొసఁగుశౌర్య
మానవంతున కివిరెండు మహితగతులు

సకలజనమస్తక ప్రదేశములనైన
వనమునందైన జీర్ణభావంబుఁ గనుట.

ఉ. నీరము తప్తలోహమున నిల్చియనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చునా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁ గాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధము మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

ఉ. క్షీరము మున్నునీటి కొసఁగెన్ స్వగుణంబులు దన్నుఁజేరుటన్
క్షీరము తప్తమౌటఁగని చిచ్చుఁజొకెన్ వెతచే జలంబు దు
ర్వార సుహృద్విపత్తిఁగని వహ్నిఁజొరంజనె దుగ్ధమంతలో
నీరముఁగూడి శాంతమగు నిల్చుమహాత్ముల మైత్రి యీగతిన్.

చ. చెలువమ్ముఁ దేటలే నగవుచేతను భావముచేత సిగ్గుచే
నలువగ్గముచేత సుగుణంబులచేఁ గడకంటి చూపుచేఁ
గలహముచేత విందులగు కందువమాటలచే నసూయచేఁ
బెలుచన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్.

సీ చూడంగఁ దగిన వస్తువులందు ఘనమెద్ది ?
తులలేకతగు వెలందుల మొగంబు;
వలపుగైకొనఁదగు వానిలో నెయ్యది ?
మగువల వదనాబ్జమారుతంబు;
వీనులకింపైన వానియందెయ్యది ?
కోమలాంగుల ముద్దుగులుకుఁపలుకు;
తనువు సోఁకిన సుఖంబొనరించు నెయ్యది ?
మెలఁతల సొబగైన మేనుదీవ;

తే. యతి మధురమెద్ది కాంతాధరామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ జాలునెద్ది ?
పువ్వుబోఁడుల వెలలేని జవ్వనంబు;
వెలయునెల్లెడఁ బడఁతుల విభ్రమములు.

చ. నిరంతముఁ దింకిబిచ్చమగు నీరసమద్దియు నొక్కపూటయే
ధరణి తలంబు సెజ్జ సతతంబును దోడు శరీరమాత్రమే
చిరుఁగుల చీరతున్కగమిచేత నమర్చిన బొంతపట్ట మీ
కరణి మెలంగినన్ విషయకాంక్ష లొకింతయుఁబాయ వక్కటా !

తే. చేరి భిక్షాన్న మారగించెదము మేము
కష్టైదము దిక్కులనియెడి కతిత శాటిఁ
బవ్వళించెద మిలయను పాన్పుమీఁద
నేమికార్యము మాకు నరేంద్రులందు.

# కోటి రాయరఘునాధ తొండమాన్

పుదుక్కోటలో 1769-1789 ల మధ్య పాలన మొనర్చినయీతఁడు రచించినట్లు తెల్పుచున్న పార్వతీ పరిణయమను కావ్యమునందలి వీక్రింది పద్యములు.

## చంద్రోదయము

మ. ఉదయోర్వీధర తస్యదై నవకరీ ఙాఘంబునం గూర్చియం
దు దినాంతంబున నిర్ధవర్యుఁడు నిజద్యోతాగ్ని రాఁజించి వె
చ్చదగన్ సీసపుబిళ్ళ వెండిగఁగొనన్ చాకొక్కమందాకుచే
వదనంబింఁడుచు నెత్తిమీటుగతి సారంగాంకుఁ డొప్పెన్ వెసన్.

పార్వతీ పరిణయము ఆ. 5.

ఆ ట వి కు లు

సీ. క్రోధరసంబు పేరు గుణానవీనిలోఁ
గాఱెనా జేవురు కన్నులమర
నాననంబున వ్రేలు నఘవంశ గుల్మంపు
మూలంబులన గడ్డములు చెంలగ
హత్యలనెన్నెన్నియని గీచిన వితాన
ముండ్ల జీరలు దేహమునఁ జెలంగఁ
బల్కుటంగనఁ దమపల్లెనే నిలనీని
పాచిదేఱిన కప్పుపండ్లతీడఁ

గీ. బందిబల్లెలు తలయుంట పాటికొయ్య
లలసి తడవిండ్లు దోటితో నంపపొదులు
నీలిదట్లును జెక్కిన నిడుదసూరు
నడర నగభిల్లు లొకకొంద అరుగుదెంచి.

పార్వతీ. ప. ఆ.

తే. యతి మధురమెద్ది కాంతాధరామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ జాలునెద్ది ?
పువ్వుఁబోఁడుల వెలలేని జవ్వనంబు!
పెలయునెల్లెడఁ బడఁతుల విభ్రమములు.

చ. నిరంతముఁ దిండిబిచ్చమగు నీరసమద్దియు నొక్కపూటయే
ధరణి తలంబు సెజ్జ సతతంబును దోడు శరీరమాత్రమే
చిరుఁగుల చీరతున్కగమిచేత నమర్చిన బొంతపట్టమీ
కరణి మెలంగినన్ విషయకాంక్ష లొకింతయుఁబాయ వక్కటా!

తే. చేరి భిక్షాన్న మారగించెదము మేము
కట్టెదము దిక్కులనియెడి కతిత శాటిఁ
బవ్వళించెద మిలయను పాన్పుమీఁద
నేమికార్యము మాకు నరేంద్రులందు.

# కోటి రాయరఘునాధ తొండమాన్

పుదుక్కోటలో 1769-1789 ల మధ్య పాలన మొనర్చినయీతఁడు రచించినట్లు తెల్పుచున్న పార్వతీ పరిణయమను కావ్యమునందలి వీక్రింది పద్యములు.

## చంద్రోదయము

మ. ఉదయోర్వీధర తస్యదైనవకరీ ఘఘంబునం గూర్చియం
దు దినాంతంబున నిర్ధవర్యుఁడు నిజద్యోతాగ్ని రాఁజించి వె
చ్చదగన్ సీసపుబిళ్ళ వెండిగఁగొనన్ చావొక్క మందాకుచే
వదనంబిండుచు నెత్తిమీటుగతి సారంగాంకుఁ డొప్పెన్‌వెసన్.

పార్వతీ పరిణయము ఆ. 5.

ఆటవికులు

సీ. క్రోధరసంబు పేరు గుణానవీనిలోఁ
గాజెనా జేవురు కన్నులమర
నాననంబున వ్రేలు నఘవంశ గుల్మంపు
మూలంబులన గడ్డములు చెంలగ
హత్యలనెన్నెన్నియని గీచిన వితాన
ముండ్ల జీరలు దేహమునఁ జెలంగఁ
బల్కుటంగనఁ దమపల్లెనే నిలనీని
పాచిదేఱిన కప్పుపండ్లతీఁడఁ

గీ. బందిబల్లెలు తలయుంట పాటికొయ్య
లలసి తడవింఢ్లు దోటితో నంపపొదులు
నీలిదట్లును జెక్కిన నిడుదసూరు
నదర నగభిల్లు లొకకొంద ఱరుగుచెంచి.

పార్వతీ. ప. ఆ. 6.

# అయ్యలరాజు నారాయణామాత్యుఁడు

ఈతఁడు వ్రాసిన హంసవింశతి యను కావ్యమున తన కాలము లోని జాతీయజీవనము చక్కఁగఁ బ్రతిబింబింపఁజేసెను. కవి 1800 ప్రాంతమువాఁడు. కార్యము మనోహరము,

ఈ క్రింది గొల్లసుద్దులు, ఆనాఁటి జనులవిశ్వాసములను తెనుఁగు నాటి యాచారములను నిరూపించుచున్నవి.

## గొల్లసుద్దులు

చ. తిరుమలకంచి పుష్పగిరి తీర్థములుంజని కొంగుముళ్ళతో
కరముల దంపతుల్వడయ వారిగఁగాన్కలువైచి యంతటన్
బరికలు దృష్టి దీపములుఁ బన్నిన గద్దెలువెట్టి యేమిటన్
గరమగు పుత్రవాంఛకడఁ గానఁగలేక విచార ఖిన్నులై

వ. ఉన్న సమయంబున

ఉ. కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడు వ్రాఁతల కృష్ణలీలలం
గ్రమ్మ గుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలులు న్నెడా
సొమ్ములు నామముల్వేలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్.

వ. ఇట్లు వచ్చి

సీ. ఫెళ ఫెళ వీరణాల్ ఖళిపెళి వాయించి
పోటులో కొమ్ముల నాట నూఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతి సేసి
కృష్ణున కతిభక్తిఁ గేలుమోడ్చి
యాదికాలపు గొంద్రనందఱుఁ గొనియాడి
తాత తండ్రుల పేళ్ళు దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ బేర్కొని మొఱయించి
దీవించి వీరుల త్రోవలెన్ని

తే. కులము పెద్దలకథ లామికొనఁగఁ జెప్పి
సివము పుట్టించి పుత్రులఁ జెందఁ గలరు
వీరులను గొల్వఁడని తెల్పి నీడుకొల్పఁ
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి.

వ. ఇట్లు వారలు సెప్పిపోయిన

మ. కొలిచెం గాటమరాజులన్ నతులు చేకూర్చెన్ మహావీర్ణ కుం
బొలమున్ రాజుల నెంతభక్తి పరతం బూజించె నాగంగకున్
వెలయన్ వేటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలియాలాగున నల్పదైవము కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్.

—హంస. విం. 2 ఆ. 85-91

# త్యాగరాజు

భక్తి మూర్తీభవించిన వ్యక్తి త్యాగరాజు. రామభక్తుఁడు. ఈతఁడువ్రాసిన గేయములు దక్షిణదేశమునం దంతటను సుప్రసిద్ధములు. సంగీతమున కీతఁడు గొప్ప సేవచేసి తెనుఁగుయొక్క యింపుసొంపులను ప్రసిద్ధికిఁ దెచ్చెను. కీర్తనలను మాత్రమేగాక కొన్ని రూపకములను గూడ రచించెను. ఈతని కాలము 1759 - 1847

క్రింది కీర్తనము మిక్కిలి ప్రసిద్ధము.

## కీర్తన - శ్రీరాగము - ఆది

ఎందఱో మహానుభావు లందఱికి వందనము ॥ఎం॥
చందురువర్ణుని యందచందమును హృదయార
విందమునఁ జూచి బ్రహ్మానంద మనుభవించు వా ॥రెం॥
సామగానలోల మనసిజలావణ్య ధన్యమూర్ధన్యు ॥లెం॥
మానస వనచర వరసంచారము నిలిపి మూర్తి బాగుగ
పొడగనేవా ॥రెం॥

సరగునఁ బాదములకు స్వాంతమను
సరోజమును సమర్పణము సేయువా ॥రెం॥
పతితపావనుడనే పరాత్పరుని గురించి
పరమార్థమగు నిజమార్గముతోను బాడుచును
సల్లాపముతో స్వరలయాది రాగముల తెలియువా ॥రెం॥

హరిగుణమణులగు సరములు గళమున
శోభిల్లు భక్తకోటులిలలో తెలివితో చెలిమితోఁ
గరుణగల్గి జగమెల్లను సుధాదృష్టిచేఁ బ్రోచువా ॥రెం॥
హొయలుమీఱ నడలుగల్గు సరసుని సదా
కనులఁ జూచుచును, పులకశరీరులయి యానంద
పయోధి నిమగ్నులయి ముదంబునను యశముగలవా ॥రెం॥
పరమ భాగవత మౌనివర శశివిభాకర సనకసనందన దిగీశ
సురకింపురుష కనకకశిపుసుత నారదతుంబురు పవనసూను
బాలచంద్రధర శుకసరోజభవ భూసురవరులు పరమపావనులు
ఘనులు శాశ్వతులు కమలభవసుఖము సదానుభవులగాక ॥ఎం॥
నీమేను నామవైభవమ్ములను నీ పరాక్రమ ధైర్యముల శాంతమా
నసము నీవులను వచన సత్యమును రఘువర నీయెడ సద్భక్తియు
జనించకను దుర్మతములను కల్లఁజేసినట్టి నీమది
నెఱిఁగి సంతతంబునను గుణభజనానంద కీర్తనము
సేయువా ॥రెం॥
భాగవత రామాయణ గీతాది శృతిశాస్త్ర పురాణపు మర్మములన్
శివాదిషణ్మతముల గూఢముల ముప్పది ముక్కోటి సురాంత
రంగముల భావముల నెఱిఁగి భావరాగలయాది సౌఖ్యముచేఁ
జిరాయువుల్ గలిగి నిరవధి సుఖాత్మువై త్యాగరాజాప్త
లైనవా ॥రెం॥
ప్రేమ ముప్పిరిగొనువేళ నామమును దలఁచేవారు
రామభక్తుఁడైన త్యాగరాజ సుతునికి నిజదాసు ॥లెం॥

త్యాగరాజ కీర్తనలు - 21 వ పుట 5 వ కీర్తన.

# తరిగొండ వెంగమాంబ

ఈమె 1840 సంవత్సర ప్రాంతమున నుండినది. ఉత్తమ విదుషి, బహుకావ్యకర్త్రి. ఈమె వ్రాసిన వేంకటాచల మహాత్మ్యమునుండి సంధ్యావర్ణనముసేయు నొకపద్య ముదాహరింపఁబడినది.

## సంధ్య

సీ. అబ్జ బాంధవుఁ డిట్టుల పరాబ్ధిఁ గ్రుంకఁక
నపుడహిగిరి నుండినట్టి లక్ష్మి
మొదలైన సతులను ముచ్చటగాఁ జూడ
హేమాంబరము ధరియించి పద్మ
రాగభూషణములు రక్త చందనమును
బసుపుఁ గుంకుముఁదాల్చి భక్తి మెఱయఁ
బశ్చిమాశాకాంత పయనమై వచ్చెనో
యనఁగ సంధ్యారాగ మతిశయిల్లె

గీ. నందుచేఁ బార్వతీ ప్రముఖాబ్జ ముఖుల
మణుల భూషణముల రక్తిమములు మించెఁ
బక్షులా రత్నములు చూచి ఫలము లనుచు
మెక్కుటకుఁ బొంచుగతిఁ చెట్లమీఁద వ్రాలె.

—వేంకటా. మా. అ. 5

# పాలవేకరి కదిరీపతి

ఇతఁడు 1850 సమీపమున నుండినట్లూహింపఁబడినది. ఈతని శుకసప్తతి యను కావ్యము మనోహరమైనది. అందు సేయఁబడిన భార్యా ప్రశంసను గూర్చిన పద్యము లిందుదాహరింపఁబడినవి.

## భార్య

గీ. భార్య యుండిన వనమైనఁ బట్టనంబు
పత్ని లేకున్న గృహమైన బహుళ గహన
మగుచుఁ గాన్పించు నరులకు నంతయేల
యాలు లేకున్న విధినైన నధముఁడండ్రు.

క. యాగముల నయోగ్యుండగు
భోగములకు బాహ్యుఁడౌ సుపుత్త్రోదయ లీ
లాగణ్యమైన భార్యా
యోగములేకుండ నరులకుచితమె చెపుమా.

ఆ. ఎంత దుఃఖమైన నింటికి వచ్చి యి
ల్లాలి మొగముఁ జూచినపుడె తలఁగు
నిది యెఱింగికాదె ఋషులు వశిష్ఠాదు
లును సభార్యులగుచు వినుతిఁ గనిరి.

క. ఒడలంటఁ గాళ్ళు పిసుకం
గడవెఁడు వేన్నీళ్ళనీయఁ గంచము వెట్టన్

బడక యమర్పఁగఁ జేతికి
నిడె మీయఁగ భార్య కాక వేఱొకతగునే.

గీ. తిథులయందైన మఱి యపత్నీకుఁడనుచు
బ్రాహ్మణార్ధంబు చెప్ప రేపాటివారు
నొకతె రూపసి గాకున్న నోసియన్న
నోయనెడి మాత్రమునకైన నుండవలయు.

—పాలవేకరి కదిరీపతి-శుకసప్తతి ఆశ్వా 2.

---

# కాసుల పురుషోత్తముఁడు

ఈతఁడు సుమారు 1800 సంవత్సరముల నాఁటివాఁడు. శతక కర్తగా సుప్రసిద్ధుఁడు.

క్రీస్తునకుఁ బూర్వము 3 వ శతాబ్దములో శ్రీముఖుఁడను సాతవాహనరాజు ఆంధ్రరాజ్యమును స్థాపించెను దీనికి కృష్ణానది యొడ్డున నున్న శ్రీకాకుళము మొదటి రాజధాని. ఇందు నెలకొల్పఁబడిన వేలుపు ఆంధ్ర విష్ణువు. "శ్రీకాకుళాంధ్ర దేవు" నుద్దేశించి పురుషోత్తమకవి యొక మనోహర శతకమును సీసపద్యములో రచించెను. ఇది ప్రతిపద రమణీయము. ఇందలి రెండు పద్యములు ఇచట నీయఁబడినవి.

## ఆంధ్రవిష్ణువు

సీ. ఆలునిర్వాహకురాలు భూదేవియై
యఖిల భారకుఁడను నాఖ్యఁ దెచ్చె
నిష్టసంపన్నురా లిందిరభార్యయై
కామితార్థదుఁడన్న ఘనతదెచ్చెఁ
గమలగర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
బహుకుటుంబకుఁడన్న ప్రతిభఁ దెచ్చె
కలుష విధ్వంసిని గంగ కుమారియై
పతితపావనుఁడన్న ప్రతిభఁదెచ్చె

గీ. నాంధ్రుబిడ్డలుఁ దెచ్చు ప్రఖ్యాతిగొని
మొదటినుండియు నీవు దామోదరుఁడవె
చిత్రచిత్ర ప్రభావ ! దాక్షిణ్యభావ !
హతవిమతజీవ ! శ్రీకాకుళాంధ్రదేవ !

సీ. నాగలి దోఁకలన్నకు నిచ్చి శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు
తాటిపెక్కెంబు కొ త్తల పెద్దకెత్తించి
గరుడ ధ్వజంబీవు గట్టినావు
వెలరాని కఱవోని వలువజ్యేష్ఠున కిచ్చి
కనకాంబరం నీవు గట్టినావు
మద్యమగ్రజునకు మత్తిలఁ ద్రావించి
జున్నుబాల్ పెరుఁగీవు జుఱ్ఱినావు.

గీ, తగవరివె యన్నదమ్ముల ధర్మమీవె
తీర్పవలెఁగాని మఱియొండు తీర్పఁగలఁడె ?
చిత్ర.కాసుల పురుషోత్తముఁడు, ఆం, వి. శ, 26, 36. ప.

# అక్కయ

ఈతఁడు యక్షగానకవి. ఈతని కాలము తెలియదు. ఈతఁడు వ్రాసిన భీమసేన విజయమను యక్షగానములో అర్ధ చంద్రికలు, అను వులు, ఏలలు మున్నగు దేశీయములైన పదబంధము లెన్నియో యుప యోగింపఁబడినవి. అట్టివానిలోఁ గొన్ని యిచట నుదాహరింపఁబడినవి.

దేశీపదములు :-

## అర్ధచంద్రికలు

గుదిగొను దిగులన గడగడవణఁకున్
పదములు తొట్రిలఁ బెదవుల తడపున్ ॥౧॥
అలమటఁ గన్నుల నశ్రులు నించున్
బాపురె విధియని షాలంబంటున్ ॥౨॥
త్రోవ వాకిటఁ దలుపు మరుగున తొంగిచూచున్
మేడమీఁదికి నెక్కి వాడలఁ కలయఁ జూచున్ ॥౩॥

## అనువులు

అంగజాగ్నులఁ గ్రాఁగి తమినను
పైన కానుక లెల్ల నిచ్చియు
నంగనలు నాపొందుకని కానంగలేరు ॥౧॥

అతివ విను నిజమేను మానిసి
నైన యిన్నాళ్ళకును నీ వా
క్కతివె బంటుగ నేలితిని నేఁడెలమితోడన్ ॥౨॥
పొలఁతి నీ పాదముల ప్రాపున
బొమ్మ గట్టెద వామపదమున
తులువమరునికి నింక నాతీఁ దొడ్ఢరెనేని ॥౩॥

# ఏలలు

కూరిమిమీఱ నన్నది - ఏరాయని పిలిచి మోము
చేరిచి తమ్ములము - నోరానించి కూడుటెప్పుడో ॥౧॥
తీవి సావిత్రావిపూవు - దీవి పొదరింటిలోన
భావజకేళినీఁ గూడి తీయని - మోవితేనెలానుటెపుడో ॥౨॥
మెచ్చి నామెడమీఁద నొఱఁగి - మెడమీఁద చెయ్యివేసి
మచ్చికల చెక్కు నొక్కుచు నాతోనది - ముచ్చటలాడుట
యెప్పుడో ॥౩॥

—అక్కయ దంతనాధ—భీమసేన విజయము-యక్షగానము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 5 | 3 | మళయాళం | మలయాళం |
| 6 | 13 | వీరెత | వీరెంత |
| 6 | 23 | వెలుగువీ | వెలుగునీ |
| 7 | 18 | ఆలవట్టు | ఆటపట్టు |
| 7 | 22 | అనూహసంగా | అనూచానంగా |
| 9 | 3 | 13 వ | 19 వ |
| 9 | 13 | దిజ్మాత్ర | దిజ్మాత్ర |
| 9 | 18 | గ్రంధము | గ్రంథము |
| 10 | 10 | చేకొసినుట | చేసికొనుట |
| 10 | 11 | గ్రంధము | గ్రంథము |
| 11 | 10 | గోనటుద్ధారెడ్డి | గోనబుద్ధారెడ్డి |
| 11 | 14 | త్రిపిరాతకుడు | త్రిపురాంతకుడు |
| 12 | 4 | అమని | ఆమని |
| 12 | 14 | పుష్పలాలిక | పుష్పలావిక |
| 12 | 15 | మొల | మొల్ల |
| 12 | 18 | జనార్ధన | జనార్దన |
| 12 | 22 | సీహాశోకము | సీతాశోకము |
| 13 | 1 | కవితార్భావము | కవితావిర్భావము |
| 13 | 2 | విజయములు | విజయులు |
| 13 | 8 | రాయమంత్రి | రామయమంత్రి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 9 | వెలిదండ్ల | వెలిదిండ్ల |
| 13 | 13 | వర్ణము | వర్ణనము |
| 13 | 15 | ఆడిదము | అడిదము |
| 13 | 15 | ప్రార్దనము | ప్రార్థనము |
| 13 | 18 | సుద్ధులు | సుద్దులు |
| 13 | 23 | దేశిపదములు | దేశిపదములు |
| 18 | 16 | కవితార్థ | కలితార్థ |
| 19 | 14 | కృష్ణారునో | కృష్ణార్జునో |
| 20 | 17 | మునిపరుందు | మునివరుండు |
| 21 | 3 | కొఁ దఁగ | కొఁ దీఁగ |
| 21 | 19 | దోషమవిముక్తి | దోషవిముక్తి |
| 22 | 10 | బరమగుపైకా | పరమగుణైకా |
| 22 | 13 | సహి | నహి |
| 22 | 16 | డుద్యజ్ఞానంబు | డుద్యద్జ్ఞానంబు |
| 22 | 19 | డనంబురగి | డనఁబరగి |
| 22 | 20 | దపంబ | దపంబు |
| 28 | 3 | సయ్యా | నయ్యా |
| 28 | 7 | నిప్పులరాల | నిప్పులురాల |
| 29 | 21 | చందబునం | చందంబున |
| 31 | 2 | పర్వతము | పర్వము |
| 32 | 19 | మాసుషుండగు | మానుషుండగు |
| 32 | 22 | యసాధువనవంగ | యసాధువనంగ |
| 32 | 23 | చనియడి | చనియతి |
| 33 | 5 | క్రీఁ | వ్రేఁ |
| 33 | 14 | మేర్పడ | యేర్పడ |
| 36 | 2 | పద్యమయిన | పద్యమయమయిన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 36 | 16 | కానందో | కానందదో |
| 36 | 19 | ర్వజముల్ | ర్వీజముర్ |
| 37 | 23 | నొదలెడు | నొదవెడు |
| 38 | 19 | నవి | నలి |
| 40 | 1 | మహాగని | మహాశని |
| 41 | 13 | లొద | రొంద |
| 42 | 13 | యగు | యశు |
| 48 | 12 | రావణునితో | రావణుతో |
| 50 | 17 | అభయుని | సభయుని |
| 53 | 4 | బలంబడి | బలంబటి |
| 56 | 12 | చిరు | చిర |
| 59 | 22 | నిన్చండి | నిన్బండి |
| 59 | 23 | యేదొప్ప | యేరొప్ప |
| 60 | 8 | నిచ్చద | నిచ్చెద |
| 60 | 17 | బడ్లును | బుడ్లును |
| 62 | 1 | యిటు | యిట |
| 62 | 11 | భక్తపతి యుద్దెంపిచి | భక్తతతి యుద్దెసించి |
| 62 | 12 | గింపవే | గింపవె |
| 63 | 4 | క్రలితి | ప్రేలితి |
| 63 | 15 | కరడిగ | కరజిగ |
| 71 | 7 | ప్రశ్రేణుల | పశ్రేణుల |
| 71 | 8 | ప్రీతాధీశువీరావళుల్ | ప్రేతాధీశవీరావళుల్ |
| 74 | 14 | అలకలవిక | అలకలలిక |
| 75 | 14 | సౌదాగ్రతల | సౌధాగ్రతల |
| 76 | 5 | జాఘుండు | జాఘుఁడు |
| 78 | 21 | నిర్ఘరాంభస్సు | నిర్ఘరాఘంస్సు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 15 | వేఁగ | తేఁగ |
| 80 | 5 | జలుకులు | జిలుకులు |
| 83 | 7 | ఆపీఢపాద | ఆలీఢపాద |
| 83 | 18 | చెలమికాడు | చెలిమికాడు |
| 86 | 2 | 1410-1160 | 1410-1460 |
| 86 | 4 | సేయు | జేయు |
| 91 | 7 | వాతలొకింతగనవచ్చెరానన | వాతులొకింత గనవచ్చె రావన |
| 91 | 12 | టరటులయ్యె | టలరులయ్యె |
| 91 | 13 | మలక | మలికి |
| 92 | 3 | పాంథంజన | పాంథజన |
| 93 | 12 | నీ మః ఖము | నీమఖము |
| 93 | 15 | రథంబులో | రథంబులొ |
| 94 | లో విడువఁబడిన మొదటి సీసపద్యపు నాల్గవ పంక్తి | | నదినేర్తు నిదినేర్తునని యేల చెప్పంగ నేరుపు లన్నియు నేననేర్తు. |
| 94 | 21 | ప్రచ్చికొనిన | ప్రబ్బికొనిన |
| 95 | 7 | నెన్నడుచో | నెన్నెడుచో |
| 96 | 5 | కమండలువో | కమండలువొ |
| 96 | 13 | జిక్కఁబడునె | జక్కఁబడునే |
| 97 | 5 | రాజువనుచు | రాజవనుచు |
| 100 | 20 | సత్క్పతి | సత్కృతి |
| 102 | 2 | నెపంబడి | నెపంబిడి |
| 102 | 7 | సుదాబ్ధి | సుధాబ్ధి |
| 103 | 2 | మ్మిహికారణ్యము | మిహికాహార్యము |
| 103 | 2 | శ్రీమన్ | బ్రేమన్ |
| 103 | 9 | దినాంత | దినాత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 103 | 16 | నాయిన్ | నాపయిన్ |
| 106 | 19 | గటియించి | ఘటియించి |
| 110 | 7 | నా కిప్పుడే | నాకిప్పుడె చెప్పు |
| 111 | 5 | హాస్యరసము | హాస్యము |
| 111 | 6 | దుస్సాధ్య | దుస్సాధ |
| 112 | 5 | కందర్పని | కందర్పుని |
| 112 | 9 | ష్కలై | ష్కలులై |
| 112 | 11 | భద్రుల్ | భద్రులు |
| 116 | 8 | జెంద | జెందు |
| 116 | 11 | కలిక | కలికి |
| 116 | 15 | దారులై | దారువై |
| 116 | 16 | పూలై | పూవై |
| 119 | 20 | జెచ్చెద | జెచ్చెర |
| 120 | 7 | యచ్చిటి | యచ్చటి |
| 120 | 18 | వెదకంగ | వెదుకంగ |
| 121 | 7 | నేల | నీల |
| 121 | 17 | రూపంప | రూపింప |
| 122 | 2 | రత్నంగు | రత్నాంగు |
| 122 | 4 | దర్శించు | దర్శించి |
| 123 | 2 | శ్రీపాదా | శ్రీపాద |
| 126 | 20 | నల్లుపిల్చి | నల్లుఁబిల్చి |
| 131 | 7 | కోలహాల | కోలాహాల |
| 132 | 9 | సుదా | సుధా |
| 132 | 22 | యేగువుతటి | యేగుతటి |
| 134 | 5 | నంచింత | నంచిత |
| 135 | 8 | భూభృణ్మౌళి | భూభృన్మౌళి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 137 | 9 | చిత్తరంబున | బిత్తరంబున |
| 140 | 4 | తామ్వాతవరుల్ | తామాత్యవరుల్ |
| 141 | 22 | కుండవప్పు | కుండపప్పు |
| 142 | 5 | జలజాతాప్తు | జలజాతాప్తు |
| 142 | 6 | స్పురణ | స్ఫురణ |
| 143 | 5 | నవఘశించు | నవఘళించు |
| 144 | 11 | ఎడవాక | ఎడపక |
| 144 | 11 | వ | వా |
| 145 | 1 | చంద్రుడన్ | చంద్రుడున్ |
| 145 | 7 | బిలచి | బిలిచి |
| 145 | 8 | మీఱనని | మఱనని |
| 145 | 8 | గూల్మయునెందుఁచయనో | గూర్మియు నెందుఁ బోయెనో |
| 147 | 1 | మీసము | బారెడు |
| 147 | 2 | గుందవరపు | గాదుగాక |
| 148 | 13 | బలుక్కిడియంబు | బల్కిడియంబు |
| 150 | 9 | బలగాయపు | బలుగాయపు |
| 150 | 11 | క్రాంచ్యుగంబు | క్రౌంచయుగంబు |
| 150 | 11 | కలగబడు | కలగంబడు |
| 153 | 9 | అతువిత | అతులిత |
| 153 | 17 | లోపల | లోవల |
| 154 | 7 | నీ విటలార | నీ విటులాడ |
| 154 | 22 | దరశేక్షణ | దరశేక్షణ |
| 155 | 12 | అయిదువరా | అయిదు వరా |
| 155 | 13 | అయిదు వరాలవు | అయిదువరాలవు |
| 155 | 15 | బోటిదో | బోటిరో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 16 | లిచ్చితిని | లిచ్చితివి |
| 157 | 4 | యగు | యను |
| 157 | 9 | బన | బున |
| 157 | 13 | నొరులన్ | నూరులన్ |
| 157 | 14 | శారికిని | శౌరికిని |
| 158 | 5 | కన్నుల | కన్నులు |
| ,, | ,, | తొలుకాలు | తొలుకారు |
| ,, | ,, | మేనుపెయ్యడం | మేనులెయ్యడం |
| 158 | 6 | గన్నవికాపును లలకంబలు | గన్నవికావుకౌను, లలకంబులు |
| 158 | 8 | కధూటులు | పధూటులు |
| 160 | 9 | నవ్ర్వేలయ | నవ్వొలయ |
| 160 | 11 | వేలార్చి | వెలార్చి |
| 160 | 14 | భూపాల | భూపాలు |
| 160 | 15 | కవ్వేద | కవ్వేళ |
| 161 | 6 | కవితైన | కవితైవ |
| 161 | 11 | పాదచర్యులు | పారాశర్యులు |
| ,, | ,, | శిషా | శిషా |
| 162 | 1 | కవితయు | వనితయు |
| 162 | 5 | చందో | ఛందో |
| 162 | 10 | ప్రకాశములగావు వసూ | ప్రకాశములు గావు వసుం |
| 162 | 11 | సదవో | సదనాం |
| 162 | 14 | లుత్ర్పేక్షలను | లుత్ప్రేక్షలును |
| 163 | 6 | మనస్ఫూర్తి | మస్ఫూర్తి |
| 163 | 9 | దేఁడు | తేఁడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 163 | 12 | జ్యాల | జ్వాల |
| 163 | 13 | నోరి | నారి |
| 163 | 15 | పృధల | పృధుల |
| 164 | 7 | దంపు పెలంగు | దఁపుటెలుంగు |
| ,, | ,, | దావినట్లు | దా విన నట్లు |
| 164 | 8 | గల్కొను | గీల్కొను |
| 164 | 9 | దల్ప | దల్పు |
| 164 | 15 | తేఁగి | కేఁగి |
| 165 | 1 | గూర్చిండి | గూర్చుండి |
| 165 | 8 | వచ్చినావో | వచ్చినావా |
| 165 | 9 | బలక | బలుక |
| 165 | 11 | నారాక | నోరాక |
| 165 | 18 | తోడి | మోడి |
| 167 | 4 | యిందైనా | యింపైన |
| 167 | 13 | బ్రాణేసు | బ్రాణేశు |
| 167 | 15 | దెలపు | దెలుపు |
| 168 | 2 | కాడనే | కాడెనే |
| 168 | 5 | తోడితేనె | దోడితేపె |
| 169 | 8 | ల్లేవే | ల్లేవె |
| 170 | 7 | నెలంటి | నొంటి |
| 170 | 18 | నాతెర | వాతెఱ |
| 170 | 21 | వెపుడు | లెపుడు |
| 170 | 13 | సతుకానన | సతులానన |
| 170 | 14 | జోరన్ | జారన్ |
| 170 | 15 | బందు | బంధు |
| 170 | 17 | చెంపఁగ | చంపఁగ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 170 | 20 | క్రమమున | క్రమ మన |
| 170 | 20 | దిట్టతనంబు యోరమున్ | దిట్టతనంబొయార మున్ |
| 172 | 3 | పైత | పైక |
| 172 | 4 | యిద్దరన్ | యిద్ధరన్ |
| 172 | 6 | రసికసుత | రసికనుత |
| 173 | 3 | అన | అను |
| 173 | 6 | సాత్వన | సాంత్వన |
| 173 | 6 | పదకము | పద్యము |
| 174 | 15 | గలదో | గలదు |
| 174 | 21 | ముద్దుపళది | ముద్దుపళని |
| ,, | ,, | సప్తపరి | సప్తపది |
| ,, | ,, | రాఫికా | రాధికా |
| 175 | 1 | మగతీఁటి | మగతేఁటి |
| 175 | 9 | తెలిరాలు కనులరాలు | చెలివాలుకనులడాలు |
| 175 | 10 | కాంతి | కాంత |
| ,, | ,, | మదుచేతి | మరుచేతి |
| 176 | 10 | నగపు | వగపు |
| 177 | 3 | తపశ్శందర్భము | తపస్సందర్భము |
| 177 | 9 | ఆపనీధరస్థల | అవనీధరస్థల |
| 177 | 11 | వియస్మధ్య | వియన్మధ్య |
| 177 | 16 | గతీ | గతి |
| 178 | 6 | వృధు | పృధు |
| 178 | 8 | పరులెత్తువెనక | పరువెత్తువెనుక |
| 178 | 11 | తసుల | తనుల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 178 | 19 | గిరినిర్ఝరంబ వింకినకాట | గిరినిర్ఝరంబు లింకినవాట |
| 79 | 1 | జళకేళి | జలకేళి |
| 180 | 4 | బడినది | బడినవి |
| 181 | 3 | ముక్కుడి | మిక్కిడి |
| 181 | 6 | సదోష్ఠి | సద్గోష్ఠి |
| 181 | 7 | వ్రతనిష | వ్రతనిష్ఠ |
| 181 | 19 | నజవ | నడువ |
| 182 | 4 | పనుగు | ఏనుగు |
| 183 | 8 | చిచ్చుడికెన్ | చిచ్చుఱికెన్ |
| 183 | 12 | నలువగుముచేత | నలువగు మోముచేత |
| 183 | 14 | కాంతులు | కాంతలు |
| 284 | 5 | నిరంతము | నిరతము |
| 184 | 10 | కతిత | కలిత |
| 185 | 4 | తన్య | వన్య |
| 185 | 4 | కరీక్షౌఘంబు | కరీషౌఘంబు |
| 185 | 5 | నిర్ధవర్వుఁడు | సిద్ధవర్యుడు |
| 185 | 5 | నిజద్యోతాగ్ని | నిజద్యోతాగ్ని |
| 186 | 7 | వదనంబిండుచు | నదనంబిండుచు |
| 186 | 12 | చెంలగ | చెలంగ |
| 185 | 3 | కాగ్యము | కావ్యము |
| 185 | 7 | కరములు | వరములు |
| 187 | 11 | గొల్వఁడని | గొల్వుడని |
| 187 | 41 | పీర్ణకుం | పీర్లకుం |
| 190 | 4 | గ్రుంకఁక | గ్రుంగఁగ |
| 192 | 2 | నిడెమీయఁగ | విడెమ్మీయఁగ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 193 | 7 | పద్యములో | పద్యములలో |
| 195 | 5 | దేశీపదములు | దేశిపదములు |
| 196 | 3 | నేలితిని | నేలితివి |
| 196 | 6 | నాతీ | నాతో |
| 196 | 10 | కేళినీ | కేళిని |
| 196 | 10 | లానుపెపుడో | లానుపెప్పుడో |
| 196 | 13 | దంతనాధ | దండనాధ |

# విద్వాన్ గంటిజోగి సోమయాజి

ఈ కావ్యమంజరిని ఏర్చి కూర్చినవారు సోమయాజిగారు. వీరి జననం 7-10-1900. వీరు తెలుగు భాషాకోవిదులు. ఇప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతులుగా పనిచేస్తున్నారు.

వీరు M. A. (Sanskrit), B. A. (Chemistry), L. T. (Science), P. O. L. (Literary criticism), Vidwan (Telugu) డిగ్రీలు పొందారు. వీరికి ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత, కన్నడ, తమిళ, హిందీ భాషలు వచ్చు. వీరి యితర రచనలు:

1. మతోద్ధారకుడు (బసవచరిత్ర) పద్యకావ్యము 1927
2. ధర్మసామ్రాజ్యము (చారిత్రక నవల) 1928
3. రామచంద్రుని హంపీయాత్ర (పద్యకావ్యము) 1929
4. ద్రావిడభాషలు (భాషాశాస్త్రము) 1930
5. కాళిదాసు (విమర్శనము) 1933
6. మేఘసందేశము (ఆంగ్ల వ్యాఖ్యానము) సంస్కృతము 1930
7. ఆంధ్రభాషా వికాసము (భాషాశాస్త్రము) 1947

★

ప్రాచీన కావ్య వాటికలలోనుండి సేకరించినవి, వివిధ వర్ణయుతములు, సరసుల కామోదము గొలుపునవి, రసవంతములు, శ్రుతి రంజకములు, అయిన పద్య కుసుమములతో గూర్చిన మంజరి. వాసనాసంభరితము. నన్నయనుండి వీరేశలింగమువరకు గలిగిన కవి వ్యవసాయమే ఫలితము. ఆస్వాదయోగ్యము. శిరోధార్యము.

దక్షిణ భాషాపుస్తక సంస్థ సహాకారమున ప్రకటితము

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.